


# వారణాసి శ్రీ రామకృష్ణ-

# {అమరావతి }  కధలు - కబుర్లు



# 25-01-23 నుండీ 16-02-24



4

## మీ జుట్టు మీద నా పీ హెచ్ డీ
## 16-02-24

మీ జుట్టు అన్నప్పటికీ కూడా -- జుట్టు నాకూ వుంది కాబట్టి ఇది నాగురించీ - మా తాతల తాతల ముత్తాతలకు కూడా వుంది కాబట్టి ఇది అందరి గురించీ కూడా .

ఉన్న జుట్టు ని చూసి , రాలిపోతున్నా జుట్టుని చూసి , తెల్లపడుతున్న జుట్టును చూసి ఎందరెందరో ఎన్నెన్నో ఆలోచించారు . చివరికి నిగ్గు తేలిన విషయం ఒకటే.

----oo----

ఒక రాజుగారు వున్నాడు . ఆయనకు తెలివైన మంత్రి బలమైన సేనాని వున్నారు .
మేము ఇంకానూ పని చేయలేము రాజా అని వీళ్ళు అంటే రాజా గారు ఒప్పుకుంటాడా ? చాల్లే మీనాటకం ఆపండి " అని మందలిస్తాడు .

-----oo-----

ఒక రాజు గారి దెగ్గర ఒక బలమైన సేనానీ మంత్రి వున్నారు . ఏమండీ మీరింకా పనికి పనికి రారండి అని రాజవరంటే - మంత్రి మరియూ సేనాని బాడ్ ఫీల్ అయి రాజుకు వ్యతిరేకంగా మారకుంటారా ?

--ooo--

పూర్వపు రోజుల్లో - జుట్టు ఊడిపోవటం అనేది మనిషికి దేముడు ఇచ్చిన సామర్ధ్యము తగ్గి పోవటం కింద చూసే వారు . జుట్టు ఊడిపోతూ వున్నది - ఇంకా మీ సేవ చేయలేను అని మంత్రి గానీ సేనాని అంటే - రాజు గారు వారిలో సామర్ధ్యము తగ్గి పోవటాన్ని ప్రత్యక్షం గా చూసి { అనగా జుట్టు లేకపోవటం చూసి }వారికి పదవీ విరమణ ఇచ్చేవారు . అలాగే సమర్ధత లేని అధికారులను రాజు

గారు తొలగించా దలుచుకుంటే " మీకు జుట్టు తగ్గి పోతూ వుంది . ఇక పదవీ విరమణ తీసుకోండి " అని చెప్పేవారు . అవతల వారు కాదనా లేక పోయే వారు .   మనిషిలోని సమర్ధత/ఓపిక  తగ్గపోవటం చూపటానికి అని  దేముడు మనుషుల నెత్తిన పెట్టిన ఒక కొలమానంగా జుట్టుని  మన పూర్వికులు  పరిగణించేవారు .

---ooo---

పిల్లలు పుట్టాక లేదా  జబ్బు పడ్డాక జుట్టంతా ఊడి పోయింది అని ఆడవారు చెపుతారు . నాలో సమర్ధత తగ్గి పోయింది అని ఆడవారు అన్నట్లు .

" బట్ట తల వచ్చేసింది . నీకు ఇంకా పెళ్లి కాలేదిమిరా ? " అని పెద్దలు కుర్రకుంకను పలకరిస్తారు . అంటే నీ సమర్ధత తగ్గిపోతూ వుంది . ఇక  పెళ్లి చేసుకొని చావు " అని హెచ్చరించినట్లు .

----ooo----

నాలో సమర్ధత తగ్గి పోతూ వుంది - నాకు వాలంటరీ రిటైర్మెంట్ ఇవ్వండి - అని రాజును అడగాలి అని అనుకునేవారు జుట్టు ని పీక్కునే వారు , ఇప్పటి జీవితంలో

కూడా ఆలోచన సామర్ధ్యము తగ్గినా వారే జుట్టు పీక్కుంటారు . సమర్ధత వున్నా వాళ్ళు జుట్టులోకి వేళ్ళు దూర్చి దాన్ని దువ్వుకుంటూ ఆలోచిస్తారు .

--oo---

కాలం గడిచి గడిచి న కొద్దీ - అసమర్ధులకు గుండు గీకించి దేశ బహిష్కరణ

చేయటం రాజులకు మామూలు అయ్యింది . యుద్ధములో ఓడిపోయినాక గుండు గీయించు కొని తనను గెలిచిన రాజు కాళ్ళ మీద పడే రాజులుండేవాఋ .నిన్ను ఎదిరించే సామర్ధ్యము నాలో లేదన్న ఓపెన్ స్టేట్మెంటు ఏ ఈ రాజు గారి గుండు .

కృష్ణుడు - అతనికెవరికో గుండు గీయించి - నీలో నన్ను ఎదుర్కునే సామర్ధ్యము లేదు అని అతనికి - అతనితో పాటు ప్రపంచానికి తెలియ పరుస్తాడు .

--oo--

ఇట్లా పోయి అట్లా పోయి జుట్టుని సంరక్షించుకుంటే మనలోని సామర్ధ్యము తగ్గదు అని ఒక ఆలోచన - ఒక

వేళా మనలో సామర్ధ్యము తగ్గినా - మనజుట్టు బాగా ఉంటే అది బయటకు తెలియదు - అన్న మరో ఆలోచన వచ్చింది . అది మనము ఇప్పటికీ వదులుకోలేదు . అందువల్ల మనము= జనం జుట్టు సంరక్షణా తైలాలు జోరుగా కొంటారు . ఆడవారు మొగవారి జుట్టు దువ్వితే మొగవారి సమర్ధత పెరుగుతుందన్న ఆలోచన వుంది . అందుకే కన్యా శుల్కం సినిమాలో లుబ్దావధాని జుట్టుని మధురవాణి దువ్వి సంరక్షిస్తున్నట్లు ఒక దృశ్యం ఉంటుంది . ఆ సినిమా పెద్దలు మామూలోళ్ళు కాదు కదా ?

----oo---

కాలక్రమేణా " నేనుఒక్క మహత్తర భాద్యత పట్ల అంకితము అయినాను " అని బహిరంగంగా ప్పటానికి అని " పిలక " వచ్చింది . పూజారులు దేమునిమహత్తర సేవ పట్ల అంకితము అయినారు కాబట్టి వారికి పిలక ఉంటూ వస్తున్నది . వారు దేముని మహత్తర సేవకు అంకితము అయినారని ఈనాటికీ కూడా మనము గ్రహిస్తాము . ఇక జపాను దేశపు యుద్ధ వీరులను చూస్తే

వారికి నుదురు మొదటినుండీ వెనక్కు ఓకే ఒక జుట్టు ముడి ఉంటుంది . ఆడో పెద్ద పిలకాలా

ఉంటుంది దీని ఉద్దేశ్యము "నేను నా రాజు గారి సేవపట్ల బాధ్యతతో అంకితము అయినాను అని ప్రకటించటమే "అని జాపనీస్ హిస్టోరియన్స్ అన్నారు . ఈ పిలక లేనివారికి రాజు దగ్గర పరపతి ఉండేది కాదుట .

మళ్ళా కాలం చక్రం తిరిగింది. " పై లాంటి వారు - నేను నా భాద్యతలు నెరవేర్చాను -అనుకున్నపుడు గుండు చేయించుకునే వారు . ఉదాహరణకు -ఒక సేనాని పెద్ద రాజు గారి సేవకు తనను తాను అంకితం చేసుకున్నాడు . పెద్ద రాజు గారు గతించి యువరాజు గారు రాజయ్యాడు .యువరాజు జారుడు స్త్రీ లోలుడూ . ఇప్పుడు సేనాని తన అంకిత భావము నుండి పై తొలగవచ్చు గదా ?

తాను సేవిస్తున్న ఆలయం శత్రువుల చేతిలో ధ్వంసం అయినపుడు - దేముని సంరక్షణలో తాను విఫలమైనానని భావించిన పూజారి పిలకను తొలగించుకోవచ్చు. . అందుకనే పిలక లేని పూజారికి

సమాజము గౌరవము ఇవ్వదు. అతడు దేముని సంరక్షణ పట్ల విఫలుడైనాడని సమాజము భావిస్తుంది . ఈ అగౌరవం ను తప్పించుకోవటానికి -అనే ఆలయ పూజారులు - దేముని విగ్రహాలను చెరువుల్లోనూ - నూతుల్లోనూ - గుహల్లోనూ దాచేవారు .అప్పుడు వారు దేముని సంరక్షణ పట్ల విఫలం చెందనట్లే గదా ? .తనను తాను ఒక పనికి అంకితం చేసుకుంటూ చాణిక్యుడు పిలక బిగించి ప్రమాణం చేస్తాడు . పిలక ఒక బాధ్యతకు అంకితం అవటం సూచిస్తుంది .

--oo--

అటుపోయీ ఇటుపోయి జుట్టు ఆధ్యాత్మిక వేత్తల చేతుల్లో పడింది " దేముడు మీలో అయన పట్ల - అందరిలో వున్నా జీవుని పట్లా ఏమి భాద్యత పెట్టాడో అది నెరవేర్చిన పుడు దానికి గుర్తుగా గుండు చేయించుకోండి " అని బోధలు చేసారు . అట్లాగా గుండు కొట్టించుకోవడం అమలులోకి వచ్చింది .

--oo--

ఎవరన్నా చని పోయినపుడు - ఆ మృతుని ఇంటి పేరుకల పురుషులందరూ గుండ్లు చేయించుకుంటారు . ఇదే బలగము అంటే అని కొందరు మురిసి పోతారు . కానీ దీని నిజపు ఉద్దేశ్యము " మృతుని పట్ల అతనిలోని జీవుని పట్ల మాకు గల కుటుంబ భాద్యతను నెరవేర్చాము " అని చెప్పుకోవటమే ఈ గుండు/ జుట్టు తీయించు కోవటం లోని అర్ధము .

--oo--

కాలచక్రము ఇంకా తిరిగింది ." పిల్లల పట్ల తల్లులకు తండ్రులకు తాతలకు నానమ్మలు అమ్మమ్మలకీ ప్రేమ తో కూడిన భాద్యత వుంది కదా ? పిల్లలకు ఏదన్నా సుస్తీ అయినపుడు వీరే కదా వారిని మోసుకుంటూ హాస్పిటల్ కి పరుగెత్తుతారు .  తమవల్ల కాదు అనుకున్నపుడు  వీరు దేముని ఆశ్రయించి - మేము అల్పులము - మా భాద్యతను నీవు నెరవేర్చు  స్వామీ" అని వేడుకుంటారు . వారి స్వామీ వారి పిల్లలని కాపాడాడు . అనగా తాతా గారో , అమ్మమ్మ గారో , అమ్మగారో, నానమ్మ గారో -  దేముని వేసుకోవటం ద్వారా  తమ భాద్యతను స్పష్టంగా

నెరవేర్చినట్లే గదా ? అట్లా గా భాద్యత నెరవేర్చిన వారు - తాము తమ భాద్యతను నెరవేర్చిన దానికి గుర్తుగా గుండు చేయించుకోవటం ఆనవాయితీ అయ్యింది . అదేనేడు మనము చూసే మొక్కు గుండు .

--oo-

మనము తప్ప ప్రపంచము లో ఏ దేశము వారు రాలి పోతున్న జుట్టు గురించి ఎక్కువ గా ఆలోచించరు - ఎక్కువగా రంగు వేయరు అని నా సర్వే లో తేలింది .

--oo--

పైన చెప్పినది నా పీ హెచ్ డీ వ్యాసము లోని ముఖ్య పాయింట్లు . అన్నపు మెతుకు పట్టి అన్నము గురించి చెప్పినట్లు - పై పాయింట్ల ఆధారంగా నా పీ హెచ్ డీ కి - గానూ డాక్టర్ పట్టా తీసి కోవచ్చునా లేదో చెప్పండి . మీ మాట శిరసా వహించుతాను . అమరావతిలోని " అమరావతీ -సర్వశాస్త్ర సరస్వతీ విజ్ఞన కళాశాల" వారికి నా పీ హెచ్ డీ రీసెర్చ్ గ్రంధమును దాఖలు చేసాను .వరేమంటారో చూద్దాము .

## పిచ్చి ప్రేమ లు ..16-12-23

కిటికీ పక్కాగా వేసుకున్న పడక కుర్చీలో పడుకొని వున్నాడు బుచ్చి బాబు. మూడు రోజులుగా అతడు అట్లాగే పడుకొని ఆలోచిస్తూ వున్నాడు అనుకోకుండా జరిగిన ఒక ఆక్సిడెంటులో అతడి కాలు విరిగింది . ఎటూ కదలలేక అతడు కిటికోలోనుండి కనపడిన మేరకు చూస్తూ , భవిష్యత్తు ను గురించి చింతిస్తూ వున్నాడు . అది చాలించుకున్నాక, ఎప్పుడో ఒకసారి చదివి పడేసిన కథల పుస్తం ఒకటి చేతపట్టి ఒక కథ మరలా మరలా చదివాడు . "తల్లుల శెక్తికి మేర అనగా హద్దు అనేది లేదు " అనేది చెప్పటం తో ఆ కథ ముగుస్తుంది .

ఆ కథలో ఇట్లా ఉంటుంది . బర్రెలను పెంచి పాడి చేసి అమ్ముకొని జీవించే ఒక స్త్రీ ఉంటుంది .ఒకనాడు ఈ స్త్రీ వద్దకు ఆమె ఇంతకు మునుపెన్నడూ చూడని ఒక స్త్రీ వచ్చి ఒక గిద్దెడు పాలు పోయమని అడుగుతుంది . అందుకు తగిన డబ్బులు లేవు అంటుంది . డబ్బుకు బదులుగా పాలు పోసే స్త్రీ యొక్క పశువుల పాకను శుభ్రం చేసి పెట్టి - పాలు పట్టుకు పోతుంది . ఇది మొదలుగా - అది వర్షం కానీవండి వరద కానీవండి ఆ స్త్రీ వచ్చి పశువుల పాకనుశుభ్రం చేసి పాలు పట్టుకు పోతూ ఉంటుంది . తాను పోసిన పాలకు సరిపడా తనకు ఆమె పని చేసి పెడుతున్నాడా ? లేదా ?

అని పాలు పోసే స్త్రీ ఆలోచిస్తూ ఉంటుంది . దానితో పాల కోసం వచ్చే స్త్రీకి మరిన్ని పనులు పురమాయించుతూ ఉంటుంది

.ఒకనాడు ఈ పాలు అమ్మే స్త్రీ తన ఆసక్తిని అణుచుకోలేక - పాలు పోయించుకొని వెడుతున్న స్త్రీని అనుసరించి పోయి చూస్తుంది . ఆ స్త్రీ వెళ్ళీ వెళ్ళీ ఊరి చివరన పొలాలలో వున్నా ఒక సమాధిలో దూరి పోతుంది . ఈ స్త్రీ వెనక్కి వచ్చి - ఆమె ఒక దయ్యమని - ఆమె తన మీద కోపముతో తనను ఏమైనా చేయవచ్చునని భయ పడుతుంది . అందువల్ల మరునాడు ఆ స్త్రీ పాలకోసం రాగానే ఆమెకు నమస్కరించి " అక్కా ఇంకొన్నిపాలు ఎక్కువ పోయానా ? ఎవరికోసం ఈ పాలు తీసుకు వెడుతున్నావో ఏమో . మరికొన్ని పోస్తాను . నీవు నాకు ఏమి పనీ చేయవద్దులే . నా అక్కవి అనుకుంటాను " అని అనునయంగా మాట్లాడుతుంది .

" సరే చెల్లీ - నా చెల్లికి అయితే నేను పనులు చేసిపెట్టానా ? నువ్వు చెప్పిన పనులు నాకు ఎదురవుతున్న కష్టం కన్నా ఎక్కువ కష్టమైనవి కాదు .ఎప్పటికన్నా కాసిని ఎక్కువ పాలే పోయి . ఎందుకంటే బిడ్డడు పెరిగి పెద్ద అవుతున్నాడు " అంటుంది .

వారిద్దరి మధ్యా జరిగిన సంభాషణ ప్రకారం - ఈ పాలు తీసుకునే స్త్రీ , ఒక బిడ్డకు జన్మ నిచ్చిపురిటిలోనే చనిపోతుంది .ఆ పై ఆత్మగా మారుతుంది . ఇప్పుడు ఆ చంటి బిడ్డ సరైన ఆలనా పాలనా సరిగా లేక పాలకై అలమటిస్తూ వున్నాడు. అందుకని ఈ తల్లి ఆత్మ ఈ రకంగా పాలు తీసుకు వెళ్లి పిల్లవాడికి అందచేస్తూ

వున్నది . " తల్లుల శక్తికి మేర అనగా హద్దు అనేది లేదు " అనేది చెప్పటమే ఈ కధ ఉద్దేశ్యము కాబట్టి - "ఆ తల్లి ఆత్మ ఇన్ని పాట్లు పడటం ఎందుకు ? ఏపైనా మహిమలు చూపించ వచ్చును కదా" అన్న మీ ప్రశ్నకు సమాధానము లేదు .

బుచ్చిబాబు అట్లా చూస్తూ ఉండగానే - ఒకనాడు చెట్టు మీద నున్న గూటిలోనుండి ఒక పక్షి పిల్ల జారి నేలను పడ్డది . పడి ఎగరలేక పోయింది . అందుకని అట్లాగే పడివుంది . వాళ్ళ మనుమడు ఎంతో దుడుకు వాడు - వచ్చి , ఆ పక్షి పిల్ల కాలికి ఒక గట్టి దారం కట్టి దాన్ని ఓ చిన్న మొక్కకు కట్టి వేసాడు . ఇంట్లో కెళ్ళి ఏవో తెచ్చి దాని ముందుచల్లాడు . తినూ అన్నాడు .ఇదీ ఒక ప్రేమే కదా ?

కుర్చీలో పడున్న వాడికి ఒక ముద్ద తెచ్చి పడేయటం ప్రేమ కాదా ?

ఇంతలో ఆ పక్షి పిల్ల తాలూకూ తల్లీ తండ్రీ పక్షులు వచ్చాయి . తమ బిడ్డను గమనించాయి .

ఆ వెంటనే తండ్రి పక్షి వెళ్లి ఎదో పురుగును నోట కరుచుకు వచ్చింది . నేల మీద పెట్టింది . తల్లి పక్షి ఆ పురుగును ముక్కున కరిచి మూడు ముక్కలు చేసింది . ఒక ముక్కను ముక్కుతో పట్టుకొని తన పిల్ల పక్షి వద్దకు చేరి తన ముక్కుతో ఆ పురుగు ముక్కను బిడ్డ ముక్కుకు అందించింది . ఆపై సంతోషంగా రెక్కలు కొట్టుకుంది . పిల్ల పక్షి కూడా తెప్పరిల్లుకుంది . తల్లి పక్షి చూపిన ఆ పిచ్చి

ప్రేమ బిడ్డ ని విడిపించలేదు . కానీ ఎంతో మనో నిబ్బరాన్ని ఆత్మా స్తైర్యాన్ని కలుగ చేసి ఉంటుందనటంలో సందేహం లేదు .

"తల్లి తండ్రుల ప్రేమలు పిచ్చి ప్రేమలు . నాకు కారు ఆక్సిడెంట్ అయినాక -- నన్ను కదల కుండా కూచో పెట్టి నా భార్యా పిల్లలు చూపే ప్రేమవేరు . ముదుసలివారై కూడా - నాకోసం అని పడుతూ లేస్తూ వచ్చిన నా తల్లి తండ్రీల యొక్క ప్రేమవేరు . వారు తెచ్చినది నేను తినటం చూసి వారు పొందిన ఆనందం వేరు . వారి ప్రేమల రుచియే అమృతం అయ్యి ఉంటుంది . నేను పెట్టినది తింటే నా బిడ్డడు కోలుకుంటాడు అని నా తల్లి అనుకోని ఉంటుంది. నిజమే ఆమె శక్తికి మేర లేదు ; ఆ ప్రేమ ఇచ్చే నిబ్బరము మనః శాంతి ఇంకే ప్రేమ ఇస్తుంది ? ఈ ప్రేమల తో నేను త్వరలోనే కోలుకుంటాను. నేను ఎవరికో ఒకరికి , దేనికో దానికి , ఎందుకొకందుకు, ఏవో కొన్ని పరిస్థితులకి బందీలుగా మారినపటికీ గూడా - నా తల్లి తండ్రులువచ్చి ఈ పిచ్చి ప్రేమలు చూపించకుండా బ్రతకలేక పోయారు .అవియే నాకు భగవంతుని అస్సీసులు " అని అనుకుంటూ బుచ్చి బాబు ఇంట్లోకి కేకవేసి "ఇటొచ్చి ఆ పక్షిని విడిచిపుపుచ్ఛన్ది - దాని అమ్మా నాయినా వచ్చినారు " అన్నాడు . తాను అన్నది ఎవరూ పట్టించుకోక పోతే - - పాక్కుంటూ వెళ్లి అయినా సరే తానే ఆ పని చేద్దామని కూడా బుచ్చిబాబు అనుకున్నాడు .

అతనిలో పిచ్చి ప్రేమల పట్ల ప్రేమ మొదలైంది .

## ది బ్యాంకు అఫ్ అమరావతి 17-12-23

నేను నా తోడల్లుడూ ఇద్దరమూ కూడాను బ్యాంకు ఉద్యోగులమే . ఇద్దరమూ కూడా అమరావతిలో వున్న రెండు ప్రముఖ బ్యాంకులలో పనిచేసి రిటైరు అయినాము . ఖర్చులు కలిసి వస్తాయని ఒకటే ఇల్లు అద్దెకు తీసుకొని అందులో రెండు కుటుంబాల వారము ఉంటున్నాము . ఈ రకంగా ఇంటిలోని ఆడవారికి ఎంతో కాలక్షేపముదొరికింది . మాకే ఏమీ కాలక్షేపము లేక పోయింది. అందు వల్ల ఒకసారి మేము ఇట్లా అనుకున్నాము " దీని తస్సా దియ్యా .. మన రిటైర్మెంట్ తరువాత మనకు కాలక్షేపము ఏమీనూ లేకుండా పోయింది .మనము కూడా ఒక బ్యాంకు పెట్టుకుందాము . బ్యాంకు అనగా ఏమిటంటే వచ్చే లాభ నష్టాలతో పనిలేకుండా జనానికి రుణాలు ఇచ్చి , ఇవ్వటం లోని మాజాని అనుభవించి చివరికి తాను దివాళా తీసేదే బ్యాంకు అంటేనూ "అని మేము ఒక నిర్ణయానికి వచ్చాము .

పై సూత్రాన్ని అనుసరించి మా ఊరైన అమరావతిలో -- ఎవరినుండీ ఎటువంటి అనుమతి పొందవలసిన అవసరం లేనట్టు వంటి ఓ బ్యాంకు తెరుద్దామని - నిర్ణయించాము .

మేము లోను ఇస్తాము - తీసుకునే వాళ్లు వస్తారు .మేము వాళ్ళకి ఏమేమో కొచ్చన్లు వేస్తాము .

యా అల్లా .. అట్లాగే మాకు ఎదో కాలక్షేపం అయిపోతుంది . లోను తీసుకున్న వాళ్ళనుండి

తిరిగి రాబట్టటం మా పాలసీ కాదు . ఎగ్గొట్టటానికి వీలు లేని కోసం ఎవరూ రారు కదా ? అని డిసైడ్ అయి పోయి -- మన కాల్సక్షేపం కోసం అని మనము నష్టపోయినా పరవాలేదు అన్న ధోరణితో తో మేము బ్యాంకు తెరిచాము .

బ్యాంకు అంటే అట్టే ఏమీ లేదు . మా వీధి గది కి ఒక కిటికీ ఉంటే - దాన్ని అటూ ఇటూ మార్పించి , బోర్లించిన పొత్రము ఆకారములో కన్నము ఒకటి పొడిపించాము . ఆ రంధ్రము చూస్తేనే చాలు అర్ధం అయిపోతుంది . ఇక్కడేదో డబ్బు ఇస్తారు పుచ్చుకుంటారు అని .

ఆలా పై కన్నము తోని మేముబ్యాంకు స్టార్ట్ చేసాము .పేరు డాబుగా వుండాలని అలోచించి , బ్యాంకు అఫ్ అమెరికా లాగా బ్యాంకు అఫ్ అమరావతీ అని దానికి బోర్డు పెట్టాము .బోర్డు అంటే ఎదో కాదు . ఆడవారు పెట్టుకునే తిలకం బుడ్డిని వాడి మా కిటికీ మీద ది బ్యాంకు అఫ్ అమరావతి అని రాసి న కాగితము అతికించి పెట్టాము .

ప్రజలే వచ్చి ఇదేమి బ్యాంకు అండి ? అని అడిగారు . మేము ఇస్తామన్న చిన్న చిన్న లోన్లు అవీ చూసి - మాది మంచి స్టాఫ్ వున్న బ్యాంకు అని వారే అన్నారు ,

మా బ్యాంకు చేసే కార్యకలాపాలు - ముఖ్యముగా మాకు లాభము రాక పోయినా సరే -- మాకు కాలక్షేపము కోసము అని చేసిన పనులు కొన్ని వున్నవి .వాటిలో కొన్ని పనులగురించి చెపుతాను వినండి.

ఒకటీ -- గాజుల మీద ఋణము- షాపుల ముందు ను,.మార్కెట్ యార్డులలోను చిమ్మే సుబ్బాము అనే ఆమె వచ్చి చీపురు మరియు

చీపురు కర్రా కొనుక్కొనుటకు ఒక లోను అడిగింది . మేము ఆమెను తరచీ తరచీ ప్రశ్నించీ - ఆమె గాజులు పెట్టుకొని మూడు వందల ఋణము ఇచ్చాము .ఆమె  గాజులు ప్లాస్టిక్ వి . అందు వల్ల లోను తిరిగి రాక పోతే మేము ఏమి చేయాలి అన్న దాని మీద మా తోడల్లుళ్ళము చేర్చించుకుంటూ చాలానే కాలక్షేపము చేసాము .ఇలాంటి రుణాలు ఎన్నో వున్నవి .

రొండు - చిల్లర రుణాలు - పిల్లలు బడికి పెడుతూ ఉంటే - తల్లులు ఆ పిల్లల చేతిలో ఐదో ఫదో పెట్టి పంపుతూ వుంటారు . ఒక్కో సారి తల్లుల దెగ్గర పెద్ద నోట్లు ఉంటాయి అసలు డబ్బులే వుండవు అనుకోండి .మరి పిల్లలేమో చేతిలో డబ్బులు పడందే బడికి బయలు దేరరు . అందుకని ఈ అవసరం నిమిత్తము మేము తల్లులకుచిల్లర డబ్బులు రుణముగా సమకూర్చాము . వారి దెగ్గర పెద్ద నోటు ఉంటే చిల్లర ఇస్తాము . అసలు చేతిలో ఏమీ లేదండీ  అంటే  మావద్ద వున్నా చిల్లరనే  వారికి రుణంగా ఇస్తాము . రోజుకు ఫది చొప్పున ఇవ్వటం అనేది  ఈ రుణాలకు లిమిట్ . తీసుకున్న వారే హామీ . వారే ఎప్పుడో వున్నప్పుడు ఒక వంద మా చేతిలో పెట్టి మా ఋణం మాఫీ అయ్యిందీ ?  అని అడుగుతారు . వారి లెక్క డొక్కా చూసి వారి ఋణం మాఫీ చేయటం మాకు పెద్ద పని మరియు పెద్ద కాలక్షేపం అయ్యింది .

మూడు --ఫిక్సెడ్ డిపాజిట్ స్కీం - ఒక నాడు ఒకరు వచ్చి ఓ ఐదు వందలు ఫిక్సెడ్ డిపాజిట్ చేస్తాము అన్నారు . బ్యాంకు అన్నాక ఫిక్సెడ్ డిపాజిట్ లు లేకుండా ఎట్లాగా ? దాని మీద వడ్డీ అనేది ఎదో ఒకటి ఇవ్వకుండా  ఎట్లాగా ? అందుకని మేము ఆ ఐదు వందలూ తీసుకొని -

ఒక ఫది రూపాయల నోటు మీద " రిసీవుడు - 500 - ఫిక్సెడ్ డిపాజిట్ విత్ వన్ రూపీ ఇంటరెస్ట్ - ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమెరికా " అని రాసి వారికిచ్చి ఇట్లా చెప్పాము - " ఇక ఈ ఫది రూపాయల నోటు ఎక్కడా చెల్లదు. కానీ దాన్ని భద్రం గా పెట్టుకొని - తిరిగి మాకు ఇచ్చి వేస్తే మీకు 501 రొప్పయాలు ఇస్తాము" . ఇలాంటి ఫిక్సెడ్ డిపోసిట్స్ ఎన్నో వచ్చినవి . ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి "అని రాసి సంతకము పెడుతూ ఉంటే వళ్ళు పులక రించేది . అందుకోసమే వందలాది ఫిక్సెడ్ డిపాసిట్లు సేకరించాము .

నాలుగు - ఓవర్ డ్రాఫ్ట్ స్కీం -- మా ఇంటి పక్కనే ఓ కిరాణా దుకాణం ఉంటే వాడితో మాట్లాడి నాము . మా ఒప్పందం ప్రకారం ఆ షాపు వాడు ఎవరికన్నా సరుకులు అప్పు ఇవ్వవలిసి వస్తే , ఆ అరువు అడుగుతున్న వారిని మా వద్దకు పంపుతాడు . మేము ఒక ఫది రూపాయల నోటు మీద

" వన్ హండ్రెడ్ రూపీస్ ఓవర్ డ్రాఫ్ట్ సాంక్షన్డ్ -- ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి "అని రాసి సంతకము పెట్టి వాళ్ళకిచ్చి మా ఒళ్ళు పులకరింప చేసుకునే వాళ్ళము .

ఈ రకంగా షాప్ వాడు అరువు మీద ఇచ్చిన సరుకులకు మేము హామీ పడ్డాము కదా ? .సరుకులు తీసుకున్న వాళ్ళు అప్పు కట్టక పోతే మేము కట్టాము -- మేము పూచీ పడ్డాము కాబట్టి - ఇందులో నష్టము వచ్చిందా ? లాభము వచ్చిందా అని లెక్కలు చూసుకోవటంలో మాకు బోలెడు కాల క్షేపము దొరికింది . మొత్తము మీద ఇప్పటికీ మా సంతకాలకుచెల్లుబడి వున్నది అని సంతోషించాము .

ఐదు - కిడ్డీ స్కీం - చిన్న పిల్లలు లేక్స్ పొటాటో చిప్స్ తెగ నములుతూ వుంటారు కదా ? దానితో వారికొచ్చే రోగాలు అనేకము . అందుకని మేము ఒక స్కీం పెట్టాము . మాకూ సమాజం పట్ల భాధ్యత వుంది కదా ? ఏ పిల్ల లేదా పిల్ల వాడైనా సరే, మా దెగ్గర ఒక లేక్స్ పొటాటో చిప్స్ ప్యాకెటు డిపాజిట్ చేస్తే ఒక వారము తరువాత అతనికి ఒక బెల్లము పప్పుండ ఇస్తాము . ఇక ఆ చిప్స్ బ్యాంకు వారు జప్తు చేసుకొని - టీ తాగుతూ తినేస్తారు .. ఇదీ మా కిడ్డీ స్కీం .

ఎటిఎం స్కీం - ఎవరికన్నా ఎటిఎం కార్డు కావాలంటే - వారి ఆర చేతి మీద " ది బ్యాంకు అఫ్ అమరావతి - ఎటిఎం - విత్ డ్రా లిమిట్ **10** టూ **500 "** అని ఒక పెన్నుతో రాసి కిందన ఇట్లు చీఫ్ మేనేజర్ - ది బ్యాంకు ఆఫ్ అమరావతి మా సంతకము చేస్తాము. పులకరించి పోతాము .

ఈ ఏటీఎం కార్డు కలిగిన వారు రాత్రి ఏడూ మరియూ ఫది గంటల మధ్య మా దెగ్గరికి వచ్చి ఆ చేయి చూపించి కావాల్సిన సొమ్ము విత్ డ్రా చేసుకోవచ్చు .ఇలాంటప్పుడు మేము సహజంగా యాభై రూపాయలు ఇస్తాము అంటాము. "కాదు కాదు-- మాకు ముందుకు తక్కువ పడ్డాయి మీరు రెండు వందలు ఇవ్వాలి " అని వారు బ్రతిమాలుతారు . మేము ఇస్తాము .ఇట్లాగా మా చుట్టూ పక్కల మా విలువకూడా పెంచుకున్నాము . చేతుల మీద రాయించుకోవటానికి వచ్చేవారితో మా బ్యాంకు కిక్కిరిసి పోతూ ఉంటుంది .

చివరాఖరికి మేము లెక్కలు చూసుకుని - సాలుకు మూడు లక్షల నష్టము వచ్చి నది అని తేల్చుకున్నాము . అందరూ ఎగ్గొట్టే వాళ్ళే

వుండరుకదా ? అందువల్ల తక్కువగానే నష్టము వచ్చినది . తక్కువ నష్టముతో - ఎక్కువ కాలక్షేపము పొందుతూ వుండటాన మేము మా బ్యాంకు ఆఫ్ అమరావతిని ఇంకా ఇంకా నడప తలిచాము .

మేము క్రొత్త పధకాలు ప్రవేశపెట్టినపుడు మీకు తెలియ పరుస్తాను . సండే చికెన్ స్కీం , మొక్కు కు రుణాలు , నైటీ స్కీం - అనేవి ప్రవేశ పెట్టాలని ఆలోచిస్తున్నాము . నైటీ స్కీం లో - మా పొరుగింటి అవిడ నెల రోజుల బట్టీ చీరలోనే ఉంటుంది - నైటీ వాడలేదు " అని ఒక మహిళా ఇంకో మహిళా గురించి రెకమండ్ చేస్తే - మేము వారికి "వన్ గ్రేమ్ గోల్డ్ " నగలుకొనుక్కునేందుకు " పైసా వడ్డీ మీద రుణాలు ఇస్తాము . అదన్న మాట .

ఇట్లు ది చీఫ్ మేనేజర్/ లోన్స్-- ది బ్యాంకు అఫ్ అమరావతి

## బర్రెను/ బుర్రను పెంచుకోవాలే . 19-12-23

ఇంటికి పాలు తెచ్చి పోసే పుల్లన్న తో ఇట్లా అన్నాను .ఇక ఆగలేకనే అన్నాను .

" ఏమోయి నీ పాలల్లో నీళ్లు ఎక్కువగా వున్నవి, ఏమిటి ? నీ ఖాతా మానేసుకోమంటావా ? " అని

" అలాగేమీ వుండదండీ .. మా పాలల్లో నీళ్లు ఎన్ని ఉండాలో అన్నే ఉంటవి . మీరు నామీదా , నాపాల మీద నమ్మకము వుంచాలే " అని అతడు అన్నాడు

" ఏమిటి నమ్మకము ?" అని నేను అన్నాను .

ఆ మరునాడు అతడు పాలతో పాటు ఒక కాగితము కూడా పట్టుకు వచ్చాడు . అది చదివాను . పుల్లన్న బట్టె గురించి ఎవరో వెటర్నరీ డాక్టర్ గారు ఇచ్చిన సర్టిఫికెట్ అది . అందులో " ఈ గేదె " ముంబా " జాతికి చెందిన హర్యానాగేదె . ఇది నమ్మకముగా రోజుకు ఇరవై లీటర్లపాలు - **66 %** శాతము వెన్న తో ఇవ్వగలదు . ఈ పశువును కొనుట కొరకై లోను మంజూరు చేయవచ్చును "

" ఈ సెర్టిఫికట్ ను చూసి అయినా మా బట్టె పాలను నమ్మండి " అని మా పుల్లాయి అన్నాడు .

" అది నమ్మకమైన పాలనే ఇచ్చును గాక . నీవు నీళ్లు కలపవని ఏమి గారెంటీ ?" అని నేను అడిగాను .

ఆ మరునాడు అతడు ఇంకో సర్టిఫికెట్ తెచ్చాడు . ఒక ఆఫీసర్ గారెవరో దాన్ని ఇచ్చారు .దానిలో

" పుల్లయ్య అను ఈ రైతు నీతీ , నిజాయతీ కలిగిన వాడు . నమ్మకమైన వాడు . ఇతని నీతి నిజాయితీలు నమ్మి -- ఇతనికి " ముంబా " జాతికి చెందిన హర్యానాగేదె కొనుటకు కావాల్సిన వ్యవసాయ ఆధారిత ఋణము ఇవ్వవచ్చును " అని వుంది .

అది నేను చదివి పుల్లయ్య వంక సోచాయింపుగా చూసినాక అతడు నాతో ఇట్లా అన్నాడు " మా గేదె నమ్మక మైన పాలు ఇచ్చును అని , నేను నమ్మ దిగిన రైతుని అని గోవర్నమెంట్ వాళ్ళిచ్చిన

సర్టిఫికెట్ ఉండనే వున్న ది .కనుక మీరు మా పాలమీద నమ్మ కం తో ఉండాలి .నమ్మ కం తో పోయించుకోవాలి . నమ్మ కం గా మా పైసలు మాకు పారెయ్యలే " అన్నా డు .

"నువ్వు ఎన్ని చెప్పినా కానీ నాకు ఎదో తేడా కొడుతూ నే వున్నది " అని నేను అన్నా ను .

అతడు ఇట్లా బదులిచ్చాడు " శారూ ఎదో తేడా తడుతూనే వున్నా కూడా మనము ఒక్కో సారి నమ్మ కము తోనే పనులు చేసుకొని పోతున్నా మా లేదా ?" .ఉదాహరణకు జెనెరల్ ఇన్సురెన్సువాళ్ళు , యూనిట్లవాళ్ళు , ఇన్వెస్ట్మెంట్ ప్లాన్ల వాళ్ళు ,రియల్ ఎస్టేట్లవాళ్ళు , మనీ స్కీం వాళ్ళు---- పాలు+ నీళ్లు పాలు కలిసి నట్లు అనేక రూల్సు / వాక్యాలుకలిపి మనకు అంతకడుతూ వుంటారు . . ఇందులో " పాలు " అంటే మనకు ఎదో లబ్ధి చేకూరుతుంది అని ఆశపెట్టే మాటలు - ఇవి పెద్ద పెద్ద అక్షరాలతో ప్రస్ఫుటము గా ఉంటవి . .ఇక "నీళ్లు " అంటే అవతలి వారికి వారికి లబ్ధి చేకూర్చి పెట్టే మాటలు . ఇవిచదవాలి అని అనిపించనంత చిన్న చిన్న అక్షరాలలో ఉంటవి . . వున్నా మొత్తము మాటలలో లో ఇవ్వే అంటే ఈ నీళ్ళే మూడు వంతులు ఉంటవి. అలాంటి పాలకోసమని మీరు ముందూ వెనకా చూడకుండా లక్షలు పెట్టుబడి పెడుతున్నా రు కదా ? . అక్కడలేని సందేహాలు, ఇక్కడెందు కండీ ? అక్కడ చూపించిన నమ్మ కంలో కొంచెం ఇక్కడ చూపించి ఈ పాలు పోయించుకోండి బాగు పడతారు

.. లేదా ఇక్కడ వచ్చిన అనుమానాలే అక్కడ చూపించండి బ్రతికి పోతారు -- కానీ మమ్మల్నేదో అని , మిమ్మల్ని మేమేదో దోచుకు తింటున్నామని ఆక్షేపణ చేస్తా మీరు బాగుపడేది ఏమీ వుండదండీ " అన్నాడు

పేపర్లో వేశారనో , టీవీ లో చూపించారనో, ఎవరో చెప్పారు అనో , నమ్మకంతో ఏవేవోకొని ,పెద్ద పెద్ద మొత్తలు పెట్టుబడిగా పెట్టి పోగొట్టుగా లేనిది - ఈ పుల్లన్న మీద నమ్మకంతో పాలు కోంటే పోగొట్టుకొనేది ఎంతా ? అని నాలో నేను తర్కించుకున్నాను .

" కొన్ని పేపర్ ప్రకటనల లో , టీవీ ప్రకటనలలో ఎంత నిజము వున్నదో - వీడి సెర్టిఫికెట్ల లో గూడా అంతే నిజము వున్నది - కాబట్టి ఆ విధాన వీడిని నమ్మి ముందుకు సాగుదాము అనుకున్నాను " సరే నువ్వు నమ్మకంగా పాలు పోయి. మేము నమ్మకంతో కొనుక్కుంటాము . కానీ మా పెట్టుబడుల జోలీ నీకెందుకు " అని నేను పుల్లయ్యను విదిలించి పంపి వేసాను.

నా విదిలింపులకు వాడు జామకాకుండా "సరే నమ్మకంతో కాకుండా యదార్ధాన్ని పట్టి పనులు జరగాలంటే --

పాలకోసము అయితే బర్రెను పెంచుకోవాలే .

లాభము కోసము అయితే బుర్రను పెంచుకోవాలే " అని చెప్పి నా మొహం వంక తీక్షణంగా చూసాడు .

# మా ఆయన ఎవరు ?          21-12-23

మల్లికా - అనే ఈ అమ్మాయి కాపురం ఉండేది ఒక పెద్ద పల్లెటూరు .నేడు  ఆమె మొదటి వివాహ వార్షికోత్సవం వచ్చింది . అప్పుడు ఆమెతన  భర్త రాంబాబుతో " ఏమండీ ఇవాళ రాత్రి థియటర్కి వెళ్లి సినిమాచూసి వస్తూ వస్తూ మంచి డిన్నర్ చేసివద్దాము . మన ఊరి థియాటర్లోకి ఏదో మంచి ప్రేమకథా చిత్రం వచ్చిందిట . చూసొద్దాము . మీరు మాత్రం  మిస్ కొట్టకుండా పెందలాడే ఇంటికి రండి " అన్నది . ఆపై  అతని గడ్డము పట్టుకొని మరీ బ్రతిమాలింది .

మల్లిక అలా భర్త ను బ్రతిమాలాటానికి ఒక కారణము వుంది . మల్లికకు లవ్వు స్టోరీ సినిమాలు అంటేచాలా  ఇష్టము . ఆమె భర్త రాంబాబు అందుకు పూర్తి వ్యతిరేకం . అతనికి- హర్రర్   టెర్రర్ కిల్లర్ - టెర్మినేటర్ లాంటి సినిమాలు అంటే చాలా  ఇష్టము . అతనికి ఏ సినిమాలోనైనా నాలుగు మర్డర్లు - వంద  లీటర్ల  రక్త  పాతము వంద సుమో ఎగురుళ్లు ఉండాలి . అన్నం లోకి ఆవకాయ - అందులోకి పచ్చి మిరపకాయ, ఉప్పు మెరపకాయా ,  కావలి అన్నట్లు.  ఇద్దరి అభిరుచులు కలవనందున - ఈ సంవత్సరంలో వారిద్దరూ కలిసి చూసిన సినిమా అనేదే లేదు - అదీ నేపధ్యము .

ఆరాత్రి ఈ భార్య భర్తలు ఇద్దరు కలిసి సినిమాకి వెళ్లారు . అది సగటు తెలుగు సినిమా.

హీరోయిన్ అనేక డ్రెస్సులు వేసి హీరోని కవ్వించింది. హీరో కూడా ప్రంచములోని అన్ని రకాల డాన్సులు ఆమె ముందుఆది ఆమె మనస్సును రంజింప చేసాడు . హీరో ఇన్ తండ్రిని

తన్ని తొడపాశం పెట్టి మరీ హీరో హీరోయిన్ ను పెళ్లి చేసుకున్నాడు హీరో . వారి ఫస్ట్ నైట్ ఎంతో

మెమొరబుల్ గా వుండాలని - కాకులు దూరని కారడవి - చీమలు దూరని చిట్టడవి మధ్యలో ఉన్న కొండా - అందులో వున్నా గుహ, ఆ గుహలో వున్నా సెలయేరు దానిపక్కనే వున్నా ఇసుక దిబ్బల మీద ప్లాన్ చేసుకున్నారు . హీరో తన స్టేటస్ కి తగ్గట్లు ఒక హెలీకాప్టర్ రప్పించి అందులో భార్యను కూచో పెట్టుకొని ఆ ఇసుక మీద దిగుతాడు . వీరుదిగి అందుకోసం ప్రిపేర్ అవుతుండగా - గుహలోనుండి నలుగురు ఆది మానవులు వస్తారు . వారు హీరో ఇన్ ను బందించి- మంత్రాలు చదువుతూ - ఆమె సజీవంగా ఉండగానే ఒక పెద్ద నిప్పుల కుంపటి మీద వేసి కాలుస్తారు . పోలిక చెప్పాలంటే కుంపటిలో మొక్క జొన్న కండెనుపెట్టి కాల్చినట్లు కాలుస్తారు . ఆతరువాత మొక్క జొన్న కండెను పళ్లతో పీక్కుని తిన్నట్లు హీరొయిన్ కాళ్ళు చేతులు పొట్టా తొడలు పీక్కు తినేస్తారు . హీరో ఇన్ చేసే ఆర్త నాదాలు విని - ఆ భయానక దృశ్యాలు , తమ మూతికి అంటిన నెత్తురును నాలికతో అద్దుకుంటున్న ఆ ఆటవిక మానవుల ఆనందాన్ని చూసి మల్లికకు మూర్ఛవచ్చినంత పనైంది

. ఈ దృశ్యాలు చూడలేక చాలా మంది థియటర్ వదిలి పెళ్లిపోయారు

మల్లిక  భర్త  చేతిని ఊతంగా బిగించి పట్టుకొని " పెళ్లి పోదాము పదండి . నామూడు అంతా చెడిపోయింది - తల తిరుగుతున్నది " అని అతన్ని ఇంటికి మళ్లించింది . రాంబాబుకు మాత్రం సినిమాకి క్లైమాక్ పడకుండా ఇంటికి రావటం ఇష్టం లేక పోయింది అయినా కానీ ఇంటికి మళ్లాడు.    .

దారిలో మల్లిక అడిగింది " ఏమిటండీ ఆ సినిమా అట్లా గుంది  ??" అని .

" ఎట్లాగో ఉండటం ఏమిటి ? నేను కోరుకున్నట్లే  వున్నది " . ఆ హీరో ఇన్ ఒక దుష్ట సెక్తి . మన హీరో దుష్ట శేక్తులనుండీ లోకాన్ని రక్షించే వాడు  . హీరో కావాలనే హీరో ఇన్ ని ఆకర్షించి ఒకప్లాన్ ప్రకారం ఆమెను ఆటవికులు ఆహారంగా చేసిఆ  దుష్ట సెక్తిని  అంత మొందిస్తాడు .ఆటవికులు చదివే మోటు మంత్రాలకు గానీ ఈ దుష్ట సెక్తి కట్టు బడదు. అందువల్ల ఎన్నో అసలు పెట్టి ఆమెను కొండల్లోకి తీసుకు వస్తాడు - అదీ కథ." అన్నాడు

మల్లిక - మూడు రోజుల పాటు మూసిన కండ్లు తెరవకుండా పడివుంది . ఆ తరువాత  సినిమా ఎఫెక్ట్ నుండి తెప్పరిల్లింది . అట్లా బయటికి వచ్చింది .

మల్లికను  పక్క ఇంటి ఆమె పేరు హేమలత పలకరించింది . " ఏమిటీ మీరు మూడు రోజులుగా బయటకు కనపడలేదు . వివాహ వార్షికోత్సవం సందర్భంగా ఇంట్లోనే ఫుల్ గానా బజానానా ? అని చిలిపిగా అడిగింది .

మల్లిక సినిమా సంగతి అంతా చెప్పి  " ఏదో సినిమాలే అని నాకు నేను సర్ది చెప్పుకొని ఇవాళే  మూర్ఛ నుండి  లేచాను " అని కూడా అన్నది .

హేమలత కళ్ళు ఇంతవి చేసి "నిన్న నే  ఆ సినిమా నేనూ చూసాను . కానీ సినిమాలో ఆలాంటి దృశ్యాలు లేనే లేవు . ఆ ఆటవికులు వీరిని తమ రాజు రాణిగా చేసుకొని కోట్ల విలువైన వజ్రాల గనులను వీరికి  కానుకలుగా ఇస్తారు . ఆ సంపదతో హీరో హీరో ఇన్ కు స్విట్జర్ లాండులో పెద్ద బంగ్లా కట్టించి - పిల్లలు పుట్టించి ఆమెను ఎంతో సుఖ పెడతాడు - చాలా లవ్వు చూపిస్తాడు " హీరొయిన్ ను   బోయింగ్ విమానాల్లో తిప్పేస్తాడు  " అన్నది  .

మల్లిక నమ్మలేదు . ఆరోజు తనతో పాటు సినిమాకి వచ్చిన ఒకరిద్దరిని గుర్తు చేసుకొని వారి ఇండ్లకు వెళ్లి వాళ్ళను వాకబు చేసింది . వాళ్ళు మాత్రం సినిమాలో ని ఆటవికులు, హీరోఇన్ ను పీక్కో తినే దృశ్యము వున్నదని అది పరమ భయంకరంగా వున్నది - చూడలేక మేము పారిపోయి వచ్చాము అని చెప్పారు .

అప్పుడు మల్లిక చెవిలో "సినిమా ఎట్లాగో ఉండటం ఏమిటి ? నేను కోరుకున్నట్లే వున్నది" అని తన భర్త అన్న మాటలు తిరిగి తిరిగి ప్రతిధ్వనించాయి .

" ఓ సినిమా ను తనకు కావాల్సినట్లు - తాను కోరుకున్నట్లు మార్చుకోగలిగిన - మా ఆయన ఎవరు ? దేముడా ? దయ్యమా ?? " అనుకుంటూ మల్లిక ఇంటికి చేరింది .

సస్పెన్స్ థ్రిల్లర్ కథను రాద్దాము అని - వారణాసి శ్రీ రామ కృష్ణ- అమరావతి రాసిన స్వంత రచన -- బై అండీ ..

## మీరు ఎవరినైనా భయ పెట్టాలా ? 21-12-23

మీరు అందరినీ భయ పెట్టాలి అనుకుంటున్నారా ? మీరు భర్తను భయ పెట్టాలి అనుకుంటున్నారా ? మీరు మొగవారు . . భార్యను భయ పెట్టాలి అనుకుంటుంన్నారా ? మీరు తండ్రి ?పిల్లలు నాకు భయపడటం లేదు అనుకుంటున్నారా ? మీరు ఒక స్కూల్ టీచర్ - పిల్లలని భయపెట్టి కంట్రోల్ లో ఉంచాలనుకుంటున్నారా ? మీరు ఎదుట వాళ్ళని తేలిగ్గా భయపెట్టేయటం ఎలాగో చెపుతాను చూడండి . ఇది మానసిక పురాణాలలో నుండి సేకరించాను .

రొండు సాంబ్రాణీ కడ్డీలు తీసుకోండి.వాటిని వెలిగించండి . వాటిచేత పొగలు కక్కించండి .పొగలు కక్కించటం ఎల్లాగూ అంటే వాటికి ఇంత కొబ్బరి నూనె పూయాలి . ఇహ మీరు ఆడవారు అయితే - వాటిని కొప్పులో పెట్టుకోండి . అదే మీరు మొగవారైతే చెవులలో పెట్టుకోండి .

మీరు అటూ ఇటూ అంటే ఇంట్లోకి బయటికి తిరుగుతూ ఉంటే . మిమ్మలను చూసిన వారు అందరూ భయ పడతారు . కాదంటారా ?

ఉప సంహారము = పూర్వము మనకు కత్తి యుద్దాలు జరుగుతూ ఉండేవి కదా? . చైనా లేదా జపాను దేశంలో కూడా ఈ కత్తి యుద్ధాలు ఉండేవి. ఎవరైనా ఒక సేనాని యుద్ధము సరిగా చేయలేదని భావించినప్పుడు రాజుగారు వాడిని పిలిచి త్రీవ్రంగా మందలించు తాడు కదా ?

అప్పుడు ఆ సేనాని అవమానము ఫీల్ అయ్యి " నేను రేపటి యుద్ధములో శత్రువు తలలు నరికి తీసుకో వచ్చి మీకు సమర్పిస్తాను . లేదా నా తల సమర్పిస్తాను " అని భీషణ ప్రతిజ్ఞ చేసేవాడు . తాను ఆ ప్రతిజ్ఞలో వున్నాను అని ఇంట్లో వారికి వీధిలో వారికి మరియూ సైన్యములోని తోటి వారికీ - ఎదుట వారికీ చెప్పటానికి అని ఈ సేనాధి పతి కొన్ని సాంబ్రాణీ కడ్డీలను వెలిగించుకుని వాటిని తన తలపై దోపుకుని పొగలు కక్కుకుంటూ తిరిగేవాడు . అంటే " ప్రతీకారం తీర్చుకోవాలని న మనసు పొగలు కక్కుతోంది " అని చెప్పినట్లు . అంతే కాక శత్రు సైనికుల తో " ఇవాళ్టి యుద్ధములో మీ తలో నా తలో ఎగిరి పోవాలి " అని కూడా చెప్పినట్లు .

ప్రాణానికి లెక్క చేయని సైనికుని ఎదుట ఎవరు నిలబడతారు ? చెప్పండి .

ఒక్కో సారి విధి వశాత్తు ఎదుటి పక్షంలో కూడా పొగలు కక్కే వారుంటే వీరిద్దరి మధ్య మాత్రమే యుద్ధము జరిగేది . చూచే వారికి కోడి పందెము చూస్తున్నట్లు ఒక వినోదము దొరికేది .

మీరు బాగా అలోచించి చూస్తే ఇదేమీ పనికి మాలిన విషయము కాదు - అని అలోచించి మీకు తెలియ పరిచిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ - అమరావతి .

## ఒక రాజు ప్రేమ కథ- 23-12-23

బ్రిటన్ కు ,భారత దేశము నకు , ఆస్ట్రేలియాకు న్యూ జీలాండ్ కు , కెనడాకు , కెన్యా కు నైజీరియా కు బర్మాకు మల్లయ్యకు సింగపూర్ కు - మరి ఇతర ముప్పది రెండు దేశాలకు- రవి అస్తమించని ఇంగ్లాండు సామ్రాజ్యానికి రాజునూ - అయిన , ఎనిమిదవ ఎడ్వర్డ్ అనబడే నేను - ఈ రోజున నా రాజ కిరీటాన్ని నా తమ్ముడు అగు జార్జ్ కి వదిలి వేస్తున్నాను "-- ఇట్లా అని ఒక కాగితము మీద రాసి పెట్టి - అప్పటి వరకూ తానే రాజు కాబట్టి తన వద్ద నున్న రాజముద్రను దానిపై వేసి , దానిని అక్కడే బల్లపై వదిలి వేసి - ఒక నిశరాత్రి వేళ లండన్ లోని బకింగ్ హాం ప్యాలెస్ నుండి బయటికి నడిచాడు - ఆనాడు మన భారత దేశమునకు రాజుఅయిన ఎనిమిదవ ఎడ్వర్డ్ .[]

తను రాజ్యము విడిచి పోవటం దేశ ప్రజలెవ్వరూ ఇష్టపడటం లేదని - వాబు దుఃఖిస్తారు అని - నన్ను ప్రేమించిన ప్రజల దుఃఖము నేను చూడలేను - అన్న భావముతో ఎనిమిదవ ఎడ్వర్డ్ తాను జన్మించిన బకింగ్ హాం ప్యాలెసు ను వీడి - తను ఇక ముందెప్పుడూ నేను ఇంగ్లాండ్ ను తిరిగి చూడలేను అనుకుంటూ తనకోసము వేచివున్న ఒక ఓడలో ఎక్కాడు . " లాంగ్ లివ్ కింగ్ " అని ఓడలోని సిబ్బంది నినదించారు ." నేను ఇప్పుడు

మీ రాజును కాను " అని నిర్లిప్తతో బదులిచ్చినఈ యన తన కు కేటాయింప పడిన కేబిన్ లోకి వెళ్లి తలుపు వేసుకున్నాడు [] .

**Prince Edward** అనే ఇతను **1894. George V, Queen Mary,**లకు మొదటి పుత్రుడు . అందువల్ల ఇతడు తన తండ్రినుండి వారసత్వంగా బ్రిటన్ రాజరికాన్ని అందుకున్నాడు .

కానీ ఇప్పుడు రాజరికాన్ని త్యజించి - దాన్ని తన తమ్ముడు అయిన జార్జి కి అప్పగించాడు .

ఈ జార్జి ప్రభువు **1924** లో ఇండియాను సందర్శించగా - అయన రాక ఒక మధుర ఘట్టము అన్నట్లుగా ముంబాయి వద్ద " గేట్ వే అఫ్ ఇండియా" ను నిర్మించారు. []

ప్రిన్స్ ఎడ్వర్డ్ తన రాజ్యాన్ని ఎందుకు త్యజించాడు ? అన్న ప్రశ్న తప్పదు కదా ?

ప్రిన్స్ ఎడ్వర్డ్ తాను ప్రేమించిన **Wallis Simpson** అనే ఆమెను వివాహము చేసుకుంటాను అన్నాడు.**Wallis Simpson** అప్పటికే , తన తప్పు ఏదీ లేకుండా ఒక భర్త నుండి విడాకులు పొంది - మరిఒకరిని వివాహము చేసికొని కాపురము చేస్తూ వుంది , ఈ లేడీ **Wallis simpson** - ఎడ్వర్డ్ ఇంగ్లాండ్ కు రాజు అని తెలిసి కూడా - అతనితో ఒక సాధారణ మనిషితో మాట్లాడినట్లే మాట్లాడుతుంది . ఆమె స్వచ్ఛమైన మనస్సు ఎడ్వర్డ్ ఆకర్షిస్తుంది . సామాన్యులలో సామాన్యునిగా బ్రతుకుతూ తిరగాలన్న ఎడ్వర్డ్ ఆలోచనలకూ ఈమె ప్రాణం పోస్తుంది . ఇలా ఇద్దరూ పరస్పరం ప్రేమలో పడ్డారు . []

" నేను నిన్ను అధికంగా ప్రేమిస్తున్నాను  వివాహము ఆడతాను " అని ఎడ్వర్డ్  అనగా , లేడీ **Wallis simpson -** అందుకు అంగీకరించి " నాకు విడాకులు ఇవ్వండి . కారణం ఏమీ లేదు . నేను నిజమైన ప్రేమలో పడ్డాను " అని తన భర్తకు ఉత్తరము రాసి పంపుతుంది .అతడు సరేను

అంటాడు .అప్పుడు ఎడ్వర్డ్ ఇంటికి వచ్చి తమ వివాహాన్ని ప్రకటిస్తారు . ఈ వార్తను ప్రజలు వ్యతిరేకిస్తారు . చర్చి అధికారులు వ్యతిరేకిస్తారు . అప్పటి బ్రిటన్ ప్రధాని విన్స్టన్ చేర్చిల్ కూడా వ్యతిరేకించుతాడు . అయన ఏమంటాడంటే " నీవు--  భర్త నుండి విడాకులు పొందిన స్త్రీని పెళ్లాడటం గురించి ప్రజలు భాద పడటం లేదు . నీవు ఒకరి స్త్రీని దొంగిలించావు అన్న భావంతో వారు నిన్ను వ్యతిరేకిస్తూ వున్నారు .ఆ కారణంగా  ప్రేమించా లెకుండా వున్నారు . ప్రెజర్ ప్రేమ పొందని నాడు మీరు ప్రభువుగా ఉండజాలరు . మీరు మీ వివాహాన్ని విరమించుకొని ప్రజల ప్రేమను పొందండి " అని .

**[]** కానీ కింగ్ఎ డ్వర్డ్ **-Wallis simpson**  యొక్క ప్రేమ పట్లనే మొగ్గు చూపుతాడు . అదే సమయంలో తాను ప్రజల యొక్క ప్రేమను కోల్పోయాడు కాబట్టి - తాను రాజుగా ఉండటానికి అనర్హుడనని నిర్ణయించుకొని - రాజ్య పరిత్యాగము చేసి - దాన్ని తన తమ్ముడు జార్జ్ కి అప్పగించుతూ - మనము మొదటిలో చదువుకున్న కాగితము , **10th December 1936.**రాసి పెట్టి  - ఫ్రాన్స్కి వెళ్లే ఓడను  ఎక్కాడు .

**[]**లక్షలాది మంది ప్రజల ప్రేమ ముందు - కుటుంబ సభ్యుల ప్రేమ ముందు - అధికారాలు కలిగించే  ప్రేమ ముందు - ఎడ్వర్డ్ తన ప్రేమను గెలిపించుకున్నాడు .

తాను రాజపదవిని వదిలి పోవటం గురించి ఎడ్వర్డ్- **BBC** రేడియో ద్వారా ప్రజలను ఉద్దేశించి ప్రసంగించారు . అందులో " నేను ఇంగ్లాండ్ ను వీడి ఫ్రాన్స్ కు వెళ్లి పోతున్నాను . ఎందుకంటే నా గుండె **Wallis** అనే స్త్రీ లో వున్నది . నా గుండె లెకుండా నేను బ్రతక లెకుండా వున్నాను " అని ప్రకటించాడు . దానితో ప్రపంచము అంతా వీరి ప్రేమను గుర్తించింది .

పారిస్ లో వాల్లిస్ ను కలుసుకున్నాక " నీవు నా రేడియో ప్రసంగము విన్నావా " అని అడుగుతాడు ఎడ్వర్డ్

" విన్నాను ఎడ్వర్డ్ . నీ ప్రతి మాటకు నేను ఏడ్చాను . నేను నిన్ను నిన్నుగా కోరుకున్నాను కానీ ఒక రాజుగా కోరుకోలేదని నీవునన్ను గుర్తించావు . నన్ను ప్రేమించావు . ప్రేమించినందు వల్ల - అతి సంతోషమైన జీవితం గడిపిన వ్యక్తిగా నీకు ఖ్యాతి తెప్పించుతాను " అన్నది

వీరి వివాహము **3rd June 1937.**న జరిగింది . బ్రిటన్ రాజా వంశస్తు లెవరూ ఈ వివాహానికి రాకుండా తమ నిరసన తెలిపారు .

**[]** ఈ వివాహం నాటికి ఎడ్వర్డుకి **43** సంవత్సరాలు . వాల్లిస్ కు **41** . ఈ పెళ్లి తరువాత జార్జ్ చక్రవర్తి తన అన్నగారికి ప్యారిస్ లో ఒక రాజభవనాన్ని కేటాయించాడు . వారికి **the Duke and Duchess of Windsor.** అనే పదవి ఇచ్చాడు . ఈ హోదాలో వారిని అనేక దేశాలకు గవర్నర్ జెనెరల్గా పంపాడు . మనకు గవర్నర్ జెనరల్ గా వచ్చిన లార్డ్ మౌంట్ బాటెన్ లాగా అన్నమాట .

ఆరకంగా వీరి ప్రేమకథ ప్రపంచ ప్రఖ్యాతి పొందింది .

" నాతమ్ముడు నా పెళ్ళికి రాకపోవటం నాకు ఆశ్చర్యం కలిగించింది " అని ఎడ్వర్డ్ తన తమ్ముడు జార్జ్ చెక్రవర్తికి లేఖ రాసాడు . కుటుంబ ప్రేమలు

అట్లాగే ఉన్నప్పటికీ - ఎడ్వర్డ్ మరియు వాల్లిస్  లు లండన్ లోని బకింగ్ హాం లో ని కి ఎప్పుడూ ఆహ్వానింప బడలేదు . వారు

నిషేధింపబడినారు .

[]  సిగిరెట్లు ఎక్కువగా అంటే రోజుకు 60 వరకూ తాగే అలవాటున్న ఎడ్వర్డ్ - ప్యారిస్లోనే చనిపోయాడు . " పారిస్ లో నా ఇల్లు వున్నా - నాదేహము మాత్రము -ఇంగ్లాండులో వున్నది . నాకు అక్కడనే అంత క్రియలు జరగాలి . నా గుండె నాతో ఉండాలి " అని ఎడ్వర్డ్ చివరిగా కోరుకున్నాడు .  ఈ కోరిక వల్ల వాల్లిస్ తన  భర్తను తీసుకొని మొదటి సారిగా అత్తా గారింటిలోకి అడుగు పెట్టింది . అప్పటికి జార్జ్ చెక్రవర్తి కూతురు రాణీ ఎలిజిబెత్  - వాల్లిస్ ను బాగా ఆదరించి " నీవు మా రాచకుటుంబములో ఒకదానవు మాతో ఉండి పో " అంటుంది .

" భర్త త్యజించిన దాన్ని తాను స్వీకరించటం అంటే ప్రేమకు ద్రోహాము చేసినట్లే అని భావించుకున్న వాల్లిస్ -- ప్యారిస్ కి తిరిగి వచ్చి - మరి 19 సంవత్సరాల పాటు భర్త జ్ఞపకాలతో - లోకానికి ముఖము చూపకుండా గడిపి -- తదుపరి  మరణించింది . అప్పుడు ఆమె అత్తారి ఇంటి వారు ఈమె ప్రేమలో ని సౌశీల్యాన్ని గుర్తించి - రాజా మర్యాదలతో ఆమెను లండన్ తరలించి

ఎడ్వర్డ్ యొక్క సమాధి పక్కనే సమాధి చేశారు .

[] వీరి ప్రేమ ప్రపంచ ప్రఖ్యాతి చెందినది అనుకున్నాము కదా ? ఎడ్వర్డ్ -- విల్లిస్ కు తొడిగిన వెడ్డింగ్ రింగ్ --  విల్లీస్  మరణాంతరం వేలానికి పెట్టారు . ప్రపంచము లోని కోటీశ్వరులకు

భార్యలు అయిన వారు తమ భర్తలతో  - "మీకు నా మీద నిజమైన ప్రేమ ఉంటే   వెళ్లి ఆ ఉంగరం కొనుక్కు వచ్చి నాకు బహుకరించండి " అని

కోరారు . అప్పుడు "ధరణిలోని రాజులెల్ల దడ దడ వచ్చిరీ " అన్నట్లు అనేకమంది కోటీశ్వరులు లండన్ కి చేరారు . చివరికి ఆ ఉంగరము ను ఆనాటి ధర **145000** పౌండ్లకు ఒక జపనీయురాలికి అమ్ముడు పోయింది .

------------------oo------------------

ది లవ్ అఫ్ ఏ కింగ్ -- అన్న ప్రపంచ ప్రసిద్ధ నిజ ప్రేమ కధకు సంక్షిప్త రూపము కలిగించి రాసినది - వారణాసి శ్రీ రామకృష్ణ - అమరావతి .

## సంపదలు **26-12-23**

సంపదలు ముఖ్యము కాదు - వాటి కోసమై పాకు లాడ వద్దు , అని ప్రపంచము లోని అన్ని మతాలు భోదించుతాయి. ఎదో ఇంత సంపాదించి, మన తరువాతి తరము వారికి అందచేయలేనపుడు, ఈ జన్మముఎందుకు-- వృధా కాదా అని కొందరు మనుషులకు అనిపించుతూ ఉంటుంది . సంపదలను కూడపెట్టటం ను నిషేధదిన అన్ని మతాలు కూడా, జ్ఞ్యానము లేదా సౌశీల్యమును సంపాదించామని భోదిస్తాయి .

ఎందుకని ఇలా భోదించుతాయి ?

సంపదను మనము ఒక తరానికి మాత్రమే గారెంటీగా అందచేయగలమేమో కానీ ఆతరువాత తరాలకు మనము ఏమి ఇవ్వగలం అన్నది సందేహమే . జ్ఞ్యానము లేదా సౌశీల్యము మనము ఎన్ని తరాల వారికైనా అనుమానం లేకుండా అందచేయవచ్చు .

అందువల్లనే అన్ని మతాలూ సంపదను సమీకరించటం ను నిరసించి జ్ఞ్యానము లేదా సౌశీల్యము ను పెంచుకోమని భోదిస్తాయి . వీటిని సాధించటానికి మనకు కొన్ని మార్గదర్శక సూత్రాల వంటివే ధర్మాలు .

ఒకటి- . పంటపొలాలను ఆశించే క్రిమి కీటకాలపై రసాయన ఎరువులు చల్లుతారు - ఈ రసాయనిక ఎరువులను తట్టుకొని బ్రతకటం ఎట్లాగా? అన్న విషయం మీద ఈ తరపు క్రిములు /కీటకాలు తమ తరువాతి తరానికి కొన్ని సూచనలు వదిలి పెడుతూ ఉంటాయి . ఈ సూచనలను-- వాటి-- దేముడు తన మదిలో నమోదు చేసుకుంటాడు అనుకుందాము . క్రిములు /కీటకాలు లో మరొక కొత్తతరం ను పుట్టించినపుడు , దేముడు పాత తరపు సూచనలను వీటిలోకి చొప్పిస్తాడు . ఈ కొత్తతరం సూచనలను పాటించి బ్రతుకుతాయి . వెనుకటి తరం వదిలి వెళ్లిన సూచనల ను ఆచరించటం వల్ల కొత్త తరం బాగుపడిందా లేదా ? సంతోష పడిందా లేదా ? [] ఇక్కడ జ్ఞ్యానము అనేది ఒక తరం తరువాత ఇంకో తరానికి -[ దేముని ద్వారా కాదు అంటే ఇంకోరకంగా నైనా సరే } సంక్రమించినందు వల్లనే మరొక తరము సంతోష పడింది లేదా బాగుపడింది కదా?

కొండల మీద చెట్లు పెరుగుతూ ఉంటాయి . ఎన్నో భీకర పరిస్థితులను ఎదుర్కొని కూడా , వంద సంవత్సరాల వరకూ కూడా బ్రతుతాయి . ఆతరువాత ఇవి కూలి నేల మీద పడి పోతాయి . కుళ్ళు తాయి . ఆకుళ్ళులోనే మరొక మొక్క మొలుస్తుంది . కొత్త మొక్క ఆ కుళ్ళుని విశ్లేషించుకుని - తనకన్నా ముందు వున్నా మొక్క -- భూమినుండి ఏమి సారము గ్రహించుకుంటూ పెరిగిందో , ఏది ఏది వద్దు అనుకుంటూ

పెరిగిందో తెలుసుకొని, తాను  వృద్ధి చెందుతూ ఉంటుంది . ఇక్కడ కూడా పాత తరము జ్ఞ్యనము  వల్ల కొత్త తరం బాగుపడిందా లేదా ? సంతోష పడిందా లేదా ? . ఇక్కడ కూడా  జ్ఞ్యానము అనేది  ఒక తరం తరువాత ఇంకో తరానికి సంక్రమించినందు వల్లనే,   మరొక  తరము సంతోష పడింది లేదా  బాగుపడింది కదా?

ఇక్కడ జ్ఞ్యానము అనేది  ఒక తరం తరువాత ఇంకో తరానికి -[ దేముడు = ప్రకృతి  ద్వారా}     సంక్రమించినందు వల్లనే  మరొక తరము  సంతోష పడింది కదా?  బాగుపడింది కదా?

మానవులకు సంపదల కన్నా జ్ఞ్యనము - సౌశీల్యము ముఖ్యము . ఒక తరము లో ని మనిషి వీటిని సాధించింతే - ప్రకృతి అనగా దేముడు ఈ సుగుణాలను  తన మదిలో రాసుకుంటాడు . కొత్త తరము పుట్టినపుడు గత తరము సాధించిన   జ్ఞ్యనము - సౌశీల్యము లను కొత్త తరాల మదిలోకి చొప్పించుతాడు  . అందువల్ల నూతన తరము మానసిక ప్రశాంతతో ను - ఆనందముతో ను ,  మంచి  పనులను మాత్రమే చేయాలన్న ఆసక్తితో ను  జన్మించి - సుఖ జీవనం గడుపుతారు .

పైరకముగా -- చూసినపుడు మనము ఇప్పుడు ఆచరించే జ్ఞ్యనము / సౌశీల్యము వంటి వాటి ద్వారానే మనము మన  మరుసటి తరము నాకు సుఖ జీవనము కల్పించగలము కానీ ఆస్తుల వల్ల కాదు .

మీకు ఉన్న కాలము మొత్తము సంపదలు కూడ  పెట్టటానికి వెచ్చించితే ? జ్ఞ్యానము సంపాదించటానికి నీ వద్ద కాలము మిగులుతుందా? అందువల్ల సంపదలు కాదు,  జ్ఞ్యానము  ను ,

సౌశీల్యమును సంపాయించ మని అన్ని మతములు ప్రోత్సహించుతాయి .

సౌశీల్యముతో - ధర్మ భద్దముగా కాలము గడిపి నాను కానీ , మరుసటి తరానికి ఎటువంటి ఆస్తులూ సమకూర్చలేక పోయానే ? అని విచారించే వారికి ఇది ఉపయుక్తముగా ఉంటుందని అలోచించి ఇది రాసినది - వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి .

## తమాషాల రాజు గారు 27-12-23

శ్రీ కృష్ణ దేవరాయల కి **36** వ తరపు ముని మనుమడిని - అని చెప్పుకునే రాజు ఒకరున్నారు . తమాషాకి అని అయన అట్లా చెప్పుకునే వాడు .

శ్రీ కృష్ణ దేవరాయలుతమాషాలు ప్రోత్సహించటం వల్లనే కదా , తెనాలి రామ లింగడు తమాషాలు చేసి చూపాడు ? ఈ తమాషాల వల్లేనే కదా వారిద్దరి పేర్లూ చరిత్రలో నిలిచిపోయినది ? నేను కూడా అట్లాగే ఏవో కొన్ని తమాషాలు చేసి నా పేరు చరిత్రలో నిలుపుకోవాలి ? అన్న ఆలోచన ఈ రాజుకు ఉండేది .

[]

ఒకనాడు ఒక దొంగ రాజు గారి కొలువుకు వచ్చి " అయ్యా -- ఒక శెట్టి గారి ఇంటికి కన్నం వేసుకొని లోపలి కి దూరబోతుండగా - గోడ కూలి కన్నము మూసుకు పోయి - అందులో చిక్కుకున్న నా కాలు విరిగింది . నా కాలు విరిగినందుకు మీరు ఏదన్నా నష్టపరిహారం ఇప్పించాలి " అన్నాడు .

" ఒక కన్నం తవ్వగానే గోడ కూలేటట్లు - ఒక ఓటి గోడ కట్టిన ఆ అసమర్ధపు తాపీ వాడిని పిలిపించండి " అని రాజుగారు అన్నాడు

వాడొచ్చి " అయ్యా ఈ దొంగ కన్నంవేసిన చోట గోడ కట్టినప్పుడు - ఒక వేశ్య అనేక సార్లు నాముందునుండీ వయ్యారంగా - అటూ ఇటూ తిరిగింది . ఆమె సోయగాలు చూస్తూ నా బుద్ధి వశం తప్పింది . ఆ మత్తులో ఆ కోస్తా గోడను ఎదో కట్టాను అంటే కట్టాను కానీ ధృడంగా కట్టినట్లు లేను " అన్నాడు

" అయితే ఆ వేశ్యను పట్టుకురండి " అని తమాషాల రాజు అన్నాడు

ఆమె వచ్చి " రాజా - ఈ గోడకు అనుకుని ఒకదారి వున్నది . ఆ దారి కుండా కంసాలి ఇంటికి వెళ్ళాను . అతడు నాకు చేసి ఇస్తాను అన్న నగ ఎంతకూ ఇవ్వక నన్ను అనేక మార్లు ఆయన ఇంటికి తిప్పుకున్నాడు . ఆ కంసాలి మూలంగా నేను తాపీ మేస్త్రీ కంటపడవల్సి వచ్చింది "

"అయితే ఆ కంసాలిని పట్టుకురండి " అని తమాషాల రాజు అన్నాడు .

కంసాలి వచ్చి " మా ఇంటిది పిల్లవాడిని పట్టించుకోక పోయినందున వాడు అదేపనిగా ఏడ్చాడు . వాడి ఏడుపుతో నేను పనిమీద ధ్రుష్టి కేంద్రీకరించి లేక పోయినాను . అందుకని ఈ వేశ్యను రెండు మూడు సార్లు

నా ఇంటికి రమ్మన వలసి వచ్చింది " అన్నాడు

" ఇప్పుడు వీడి ఇల్లాలును రప్పించండి "అని తమాషాల రాజు అన్నాడు .

ఆమె వచ్చి " అయ్యా మాకు ఒక కోడి పెట్ట వున్నది . అదిరోజూ , మా పొరుగున వున్నా బ్రాహ్మణుల ఇంటిలోకి దూరి అన్నం మెతుకుల కోసమని భూమిని కెలుకు తూ ఉంటది . దాన్ని వెనక్కు పిలుచుకో పొమ్మని ఆ బాపనయన నామీదకి తగాదాలకు వచ్చాడు . ఆయన కారణంగా నేను

అటు పోయాను . నేను వాడిని వదిలి వెళ్ళాను అని పిల్లవాడు గుక్కపట్టి ఏడ్చాడు . ప్రతి నిత్యం మాకు ఇదే తగాదా. పిల్లవాడి ఏడుపుకు కారణమూనూ " అన్నది .

ఇప్పుడు మన తమాషాల రాజుగారు - వెళ్లి ఆ బ్రాహ్మణా ఆయనను ఈడ్చుకు రమ్మంటాడు" అని సభా సదులు అనుకున్నారు .

" బ్రాహ్మలు అంటే దేవతా స్వరూపులు - వారిని విచారించరాదు. అందువల్ల - ఓ భటులారా వెళ్లి ఆ కోడిని చంపి రాండీ " అనిచెప్పి రాజు ఆనాటికి కొలువు ముగించాడు .

**[][]**

ఆ మరునాడు ఒక మనిషి వచ్చి " అయ్యా నేను నిత్యమూ ఆలయ దర్శనము చేస్తాను . ఇవాళ మామూలు వేళకు దైవ దర్శనము కాలేదు . కారణం - బ్రాహ్మడు గుడి తలుపులు తెరవలేదు .

దైవ దర్శనం లేక నాకు మనస్తాపం కలిగింది . దేముడు కూడా మనస్తాపం చెందే ఉంటాడు. .మా మనస్తాపం పోగొట్టటానికి ఏదైనా చేయండి " అని అడిగాడు .

" దేమునికి మనస్తాపం తెప్పించిన వాడి ని పట్టుకు రండి" అని రాజు అన్నాడు ,

ఆలయ అర్చకుడైన బ్రాహ్మడు వచ్చి " అయ్యా నిన్న మీ భటులేవరో వచ్చి, మా పెరటిలో తిరుగుతున్న- పొరిగింటి వారి కోడిపెట్టను బాణాలతో కొట్టి చంపేశారు . శవం ఇంటిలో ఉండగా ఆలయం తెరువవచ్చా ? లేదా అనే సందిగ్దం లో పడి- అలోచించి - చివరికి ఆ కోడిని ఊరి వెలుపలకు ఈడ్చి పారేయించి - ఆపై స్నానము చేసి గుడి తలుపులుతెరిచాను . ఈ

ఆలస్యము వల్ల భక్తులు - వారితో పాటు నేను - నాతో పాటు దైవము-- ఇలా అందరమూ కూడా మనస్తాపము చెందాము " " అని విన్నవించాడు .

[][][]

" ఇది తిరిగి తిరిగి నా మెడకే చుట్టుకున్నదే" అని ఆలోచించిన తమాషాల రాజుగారు ---

దొంగచే కన్నం వేయబడ్డ ఇల్లుగల శెట్టి గారిని పిలిపించాడు " నువ్వు దొంగలకు ఆకర్షవంతగా కనపడేటట్లు ఇల్లు కట్టావు కాబట్టే కథ ఇంత వరకూ వచ్చింది . దేమునికి మనస్తాపము పోగొట్టటానికి అని, దేమునికి ఉత్సవాలు జరిపించి - ఊరి ప్రజలందరికీ విందు భోజనం పెట్టు . కాలు విరిగిన దొంగ చేతులు బాగానే వున్నవి కావున వాడి చేత గుడి పరిసరాలు ఊడ్పించి - వాడిచేతనే కూరలు అవీ తరిగించండి. మజ్జిగ చిలికించండి " అని రాజుగారు తీర్పు చెప్పారు.

విరిగిన కాలుతో, డేక్కుంటూ పాక్కుంటూ, పాక్కుంటూ డేక్కుంటూ-- దొంగ ఆలయ పరిసరములు అన్నీ చిమ్మి ఊరి వారి విందుకు కావాల్సిన స్థలము మరియూ మజ్జిగా సిద్ధము చేసాడు .దొంగ వ్యవహారము తమాషాగా ముగిసింది కదా అని ఊరి జనులు అనుకున్నారు . రాజునకు కావాల్సిందే ఆదికదా ? అయన తెగ సంతోషించాడు .

అయితే మొదటిలోనే " నేను దొంగవి - అని నీవే వప్పుకుంటున్నావు - కాబటికి నిన్ను బందిస్తూ వున్నాను " అని రాజు అనివుంటే ఈ తమాషా జరగకనే పోవును . తమాషా మనుషులు లేకపోతే తమాషా కధలు వుండవు

# రహస్య రాణి

# 28-12-23

[] క్రిప్టో కుర్రేన్సీ అంటే ? డిజిటల్ రూపం లో రహస్యంగా అటూ ఇటూ చేతులు మారే నగదు . అన్ని దేశాలకు మన రిజర్వు బ్యాంకు వంటిది ఉంటుంది . నగదు ఇచ్చి పుచ్చుకునే వ్యవహారాలు అన్నీ ఈ బ్యాంకు ఏ నియంత్రిస్తూ ఉంటుంది . లేదా తెలుసుకుంటూ ఉంటుంది .

కానీ రిజర్వు బ్యాంకు వంటి ఏ బ్యాంకు యొక్క నిభందన కూ లోబడకుండా , - ఒక వ్యక్తియో లేక కొందఋ వ్యక్తులో , తమ సొంత నియమ నిభంధనల క్రింద - నగదు లావాదేవీలు జరపటాన్ని క్రిప్టో కురెన్సీ అంటారు . నగదును నియంత్రించడంలోను అటూ ఇటూ ఇచ్చి పుచ్చుకోవటం లోను బ్యాంకులు ఏమి లాభము పొందుతాయో అదే లాభాన్ని క్రిప్టో కరెన్సీ నిర్వాహకులు పొందుతారు . గవర్నమెంట్ దృష్టికి చిక్కకుండా నగదు లావా దేవీలు జరుపుకుంటే ఏమి లాభాలు ఉన్నావో ఆ లాభాలను పొందగోరు వారు, ఈ క్రిప్టో కరెన్సీ లావాదేవీలు జరుపుతారు

[] క్రిప్టో అనగా రహస్య భాష ---కరెన్సీ అనగా నగదు కాబట్టి క్రిప్టో కరెన్సీ అంటే రహస్య భాషలో నగదు ఇచ్చి పుచ్చుకోవటం . ఇందులో ఇటు ఇచ్చేవారికి అటు పుచ్చుకునే వారికీ తప్ప మూడో వారికి ఏవిధమైన సమాచారం లభించని విధంగా రహశ్య మైన సాంకేతిక భాషలో లావాదేవీలు జరుపుతారు . మీరు నిత్యం వాడే ఏటీఎం కార్డులు, వాటి పాస్ వర్డ్స్ మరియు పిన్ నంబర్లు క్రిప్టో భాష కిందకు వస్తాయి కానీ - మీరు ఎటిఎం లో చేసే పనులన్నింటినీ - ఎక్కడో ఒకక్కడ - ఎవరో ఒకరు తెలుసు

కుంటూ నే ఉన్నందున - మీరు తీసుకున్న డబ్బు క్రిప్టో కరెన్సీ కిందకు రాదు .

దీనివల్ల క్రిప్టో కురెన్సీ స్వరూపం మీకు అర్ధం అయ్యి ఉంటుంది అనుకుంటాను .

[] " బిట్ కాయిన్ " అనేది క్రిప్టో కరెన్సీ లోలావాదేవీలు నడిపే వారికి సహకరించే సంస్థ . దీన్ని నడపాలంటే ఎంతో దమ్ము , ధైర్యము- ప్రభుత్వముతో మంచితనము కావలి కదా ?

ఇవన్నీ వున్నందుకు - కంప్యూటర్ల ద్వారా వాటిని ప్రదర్శించినందుకు తగిన ఆర్ధిక ఫలితం దక్కాలి కదా ?? లేనిదే వారెందుకు ఈ పని చేస్తారు ?

[] బిట్ కాయిన్ వంటి సంస్థలు తమ షేర్లను అమ్మకానికి పెడుతుంటాయి . ఉదాహరణకు మీరు ఒక వందరూపాయలు పెట్టి బిట్ కాయిన్ లో ఒక షేర్ కొంటే సంవత్సరం తిరిగే సరికి అది లక్ష రూపాయలు పలకోచ్చు . అందువల్ల బిట్ కాయిన్ వంటి సంస్థలు ఇటు మదుపరులను- అటు లావాదేవీలు జరిపేవారినీ తెగ ఆకర్షిస్తూ ఉంటాయి .

[] పైన చెప్పిన ఆకర్షణను సొమ్ము చేసుకునే ఉద్దేశ్యముతో " వన్ కాయిన్ " అనే సంస్థ ఒకటి అమెరికాలో పుట్టుకొచ్చింది . క్రిప్టో కరెన్సీ లో మీ లావాదేవీలను నడుపుతాను అని జనాన్ని నమ్మించి మరియూ " మా వన్ కాయిన్ " కంపెనీ షేర్లలో మీరు పెట్టుబడి పెడితే వచ్చే లాభం వందరెట్లు " అని ఒక రహస్య ప్రచారం { అంటే ముల్టీ లెవెల్ మార్కెటింగ్ వంటిది } చేసుకుంది.

[] ఇది **2015** లో అమెరికాలో అవతారం ఎత్తి , **2016** నాటికి మూడున్నర మిలియన్ అమెరికన్ ప్రజలనుండి - నాలుగు బిలియన్ డాలర్ల డబ్బును కాజేసింది . అప్పుడు అమెరికా ప్రభుత్వ ము మేల్కొన్నది . అమెరికాలో

కూడా - మనలాగే మోసపోయే వాళ్ళు కూడా వున్నారు అంటే ఆశ్చర్యమే ? .

[] అమెరికా ప్రభుత్వ ఉద్దేశ్యాలు ప్రకారము ఎటువంటిపైనా సరే నూతన ఆవిష్కరణలు వ్యాపారాలు చేయటం తప్పు కాదు . కానీ వన్ కాయిన్ సంస్థ ప్రజలను మోసగించే ఉద్దేశ్యముతోనే మొదలు పెట్ట పడింది అని, --- కావాలనే బిట్కాయిన్ తో తనకు పోలిక చెప్పుకున్నది -- అన్న ఆరోపణలతో **FBI** వారు ఈ సమస్త మీద విచారణ జరిపారు ఈ విచారణలో **".Ruja** ఇగ్నటోవా **"**అనే బల్గెరియా దేశపు స్త్రీ కీలక సూత్ర ధారీ మరియు పాత్ర ధారీ అని బయట పడింది .

**BBC** వారు ది**"** క్రిప్టో క్వీన్ **"= "** రహస్య రాణి **"** అన్న పేరుమీదఈమె గురించి వార్తలు ప్రసారం చేశారు . **2019** నుండి ఈమె ఆచూకీ దొరక్కుండా మాయం అయ్యింది. ఈమె వల్ల అమెరికన్ లే కాక అనేక ఇతర దేశస్థులు కూడా మోసపోయారు .ఈమె ఆచూకీని పట్టి ఇచ్చినవారికి **250000** అమెరికన్ డాలర్ల బహుమానం ప్రకటించారు .**FBI** వారు .

ఎన్నో చోట్ల ఈమె మీద కేసులు పెట్టారు . కొన్ని దేశాలలో- ఏ ఫలితము సాధించకుండానే ఈమె మీద పెట్టిన కేసులు యెత్తి వేశారు . అనగా రాజకీయ నాయకులూ జోక్యం చేసుకొని - తమకు అందినంత మింగి - ప్రజల సొమ్ముకు మంగళం పాడారు అని అర్ధము.

[] ఇటుపైన అంతర్జాతీయముగా విస్తరించి , పనిచేసే మాఫియా వారు దీనిలో వేలుదూర్చి ఆమె సొమ్మును మొత్తము తమ సొంతము చేసుకొని - ఈమెను **November 2018** లో బల్గెరియా లోనే హత్య చేశారు . ఈమెను హత్య చేసాడు అని నేరము ఎదుర్కొంటున్న**Hristo Hristov** అనే వ్యక్తిని డచ్ జైలులో బంధించారు . క్రిప్టో క్వీన్ **Ruja** ఇగ్నటోవా -

ఒక విలాసవంతమైన నౌకలో- సముద్రంలో తిరుగుతూ ఉండగా తాను హత్య చేసి ఆమె శరీర ఖండాలను సముద్రములో విసిరి వేశాను అని ఇతడు అన్నాడు .

ఇతనికి ఎంతముట్టిందో ? అన్నది తేలలేదు . అమెరికా **FBI** ఇస్తానన్న **250000** అమెరికన్ డాలర్ల బహుమానం కాదని - క్రిప్టో క్వీన్ చంపి నాను అంటూ జైలుకు వెళ్లిన ఇతడు ఒక మాఫియా లీడర్ కి అనుచరుడు . అందువల్ల ఇత్తడికి మాఫియా వారి నుండీ **250000** అమెరికన్ డాలర్లకన్నా ఎక్కువ మొత్తమే ముట్టి ఉంటుంది

.

**[]** క్రిప్టో క్వీన్ మరణించింది అన్న విషయాన్నీ **FBI** ఒప్పుకోలేదు . కొందరు రాజకీయ పెద్దలు - మాఫియా మరియూ - పోలీసులు కలిసి క్రిప్టో క్వీన్ మరణించిందన్న నాటకం వేసి - కేసుకు ఒక తప్పుడు ముగింపు ఇచ్చే ప్రయత్నం జరిపారు అని **FBI** అన్నది . **FBI** వారు ఈమె చని పోలేదని అన్నారు కాబట్టి , ఈమె బ్రతికి వున్నట్లే అని అనేక దేశాలు నమ్మాయి . అమెరికా పవర్ అంటే అలాఉంటుంది మరి .

**[]** "ఆమె ఒక విలాసవంతమైన నౌకలో తిరుగుతుండగా చంపాను " అన్న వాక్యం గుర్తు చేసుకోండి . కోట్ల రూపాయల ప్రజల సొమ్ము కాజేసిన వారు ముందుగా ఒక ఓడను కొనుక్కుంటారు . ఇక వారిమీద నేరము మోపబడినప్పుడు - ఆ ఓడను ఎక్కి సముద్రము లోకి వెళ్లి పోతారు . కాలము తమకు అనుకూలించే దాకా - ఆ ఓడల్లో నే విలాసవంతంగా జీవిస్తారు . మన దేశపు ఆర్ధిక నేరస్థులను కూడా చూడండి - వారికి కూడా ఓడలు ఉంటాయి .

[] సాధారణ  ప్రజల సొమ్ము ఏ రాజకీయ నాయకుల చేతుల్లోకి పోయింది ? అసలు ఇంత కుంభకోణము అంతా ఈ  స్త్రీ ఒక్కతే  నడిపిందా ? వెనుక ఇంకా ఎందరు పెద్దలు వున్నారు ? అన్నది తేలకుండా ఉండేందుకే ఈమెను హత్య చేసి సముద్రములో పారవేసారు .లేదా మాయం చేశారు .

ఇదే మన దేశములో జరిగితే " మా సొమ్ము తిన్న వాడు బాగు పడడు- మట్టి కొట్టుకు పోతాడు " అని ఏడ్చి , శపించి శాపనార్థాలు పెట్టి వదిలి వేస్తారు .  చివరికి అమెరికన్ ప్రజలు కూడా ఇలాగే చేయవలసి వచ్చింది . వాళ్ళుకూడా " మా సొమ్ము తిన్న వాళ్ళు ఎవరూ బాగుపడరు . అందుకే ఆమె అలాగా దిక్కుమాలిన చావు చచ్చింది " అని అన్నారు .ఈ రకంగా అమెరికన్లు మనలో చేరి మనతో సమానులైనారు .

అక్కడితో కథ ముగిసింది .  నిజంగా సొమ్మును మింగిన వాళ్ళు చిరంజీవులుగావుంటారు .  .మధ్యలో చెంచాల మాదిరిగా వున్నా  వారు దిక్కు మాలిన చావు చస్తారు .

## మన తమాషాల  రాజు గారు కొలువు తీరి యున్నారు .1-1-24

" దేశములో దొంగలు పెట్రేగి పోయి వున్నారని రాజ్యములో ప్రశాంతత లోపించిందని"  వేగులు వార్తలు తెచ్చిరి . ఆ వార్తకు సస్పందించిన మంత్రి గారు లేచి  "రాజా - దొంగలతో మన జైళ్లు నిండి పోయి వున్నవి . మన రక్షక భటులు దొంగలను పట్టి తెచ్చినచో వారిని ఎక్కడ పెట్టుటయా ? అన్న సందేహముచే ఇక  దొంగలను పట్టు కొనుటలేదు . ఉన్న దొంగలనే ఎవరూ పట్టుటలేదు. ఇక కొత్త దొంగల ఆచూకీ చెప్పినచో ఒరుగునది

ఏమున్నది - అన్న నిర్లిప్త భావముతో ప్రజలు దొంగల గురించి- దొంగ తనముల గురించి  సమాచారం కూడా చెప్పుటలేదు . ఈ కారణములు వల్ల మన రాజ్యములో పాత దొంగలతో పాటు  కొత్త దొంగలు కూడా రంగములోకి దిగి అనేక దొంగతనములు చేస్తూ వున్నారు. అందువల్లనే రాజ్యములో ప్రశాంతత లోపించింది . కనుక మనము అదనపు కారా గారములు కట్టవలెను . సొమ్ము ఇప్పించుడు " అని అడిగెను .

అప్పుడు మన తమాషాలు రాజు గారు ఏమన్నారంటే "ఇట్లైన ప్రజలకు రాజు పైన ప్రజలకు అసంతృప్తి కలుగును . అది మన దొరతనమునకు మంచిది కాదు .కాబట్టి  .  ప్రస్తుతము జైలులో ఉన్న దొంగల ను బయటికి తెచ్చి వారి కాళ్లకు  సంకెళ్లు వేసి వీధుల వెంట  తిప్పుము . ఆలా త్రిప్పుచూ " మీకు  , మరుగు దొడ్లు ఊడ్చుటకు , అంట్లు తోముటకు, బట్టలుతుకుటకు , మనిషి కావెలనా ? పని చేసిన వానికి  ఇంత చద్దెన్నము పెట్టిన చాలును " అని అడుగుచూ ఇంటింటికీ వెళ్లి,  ఆ గృహిణిని అడుగుము . ఈరకంగా మనము ఒక దెబ్బకి వంద పిట్టలు కొట్టిన వారమగుదము" అనెను .

మంత్రి గారు తమాషాల  రాజుగారు చెప్పినట్లే చేసిరి .  ఇల్లాండ్రు సదావకాశము దొరికేనని భావించి  కేవలము తమ ఇంట వున్న చద్దెన్నమునే ఖర్చుపెట్టి - దొంగలలచే తమ దొడ్లు కడిగించుకొనిరి . ఇంకాను   ఇలాంటివే వారికేమేమి ఇంటి  పనులు అవసరమున్నవో అవన్నీ  దొంగలచేతనే చేయించుకొనిరి .రాజు భందించిన  దొంగలు తమకు పనికి వచ్చుచుండుటచే - ప్రజలు గడ్డి వోచను దొంగతనము చేరిన వారి గురించి కూడా రాజునకు సమాచారం ఇచ్చి వారిని పట్టించిరి . లేదా వీరే దొంగలను పట్టి రాజభటు లకు అప్పగించిరి .

"ఎంతో కష్టపడి దొంగతనము చేసి - ఆనవాయితీగా పోవలసిన జైలుకు పోవుటకు బదులు ఈ దొడ్లు కలుగుట ఏమిరా ? అని అలోచించి దొంగలు దొంగతనము మానిరి .

ప్రజలు వీరిని చద్ది దొంగలు అనిరి . ఈ చద్ది దొంగల మూలకంగా ప్రతి ఇల్లూ శుభ్రముగా ఉండ సాగినది .దానితో ప్రజలలో ఆరోగ్యము పెరిగినది . దానితో వారు కష్టించి పని చేసి ఎక్కువ పంటలు పండించిరి . రాజుకు పన్నులు ఎక్కువగాను చ్చక్కగానూ వచ్చెను. రాజ్యము ఐశ్వర్యవంతము అయ్యెను . .రాజ్యము ప్రశాంతము అయినది . ప్రజలు ముఖ్యముగా స్త్రీలు మారాజు దేముడు అని అభిమానించిరి రాజు పట్ల ఆదరణ పెరిగినది . ఇక కొత్త జైళ్లు కట్టవలసిన డబ్బుకూడా ఆదా అయ్యను.దానిని పెట్టి గుడులు బడులు కట్టిరి. పాత జైళ్లు నడుపుటకు కావాల్సిన డబ్బుకూడా ఆదా అయ్యెను .దానితో చెరువులు తవ్విరి చెట్లు నాటిరీ . ఇట్లు మన తమాషాలు రాజు తన తమాషా నిర్ణయము మూలకంగా , చరిత్రలో ఎంతో ఖ్యాతి పొందెను

## విచిత్ర విషయాలు - సైబర్ కిడ్నాప్ లు
## 5-1-24

**<>** మారుతున్న కాలము తో పాటు సాంప్రదాయకమైన కిడ్నాప్ లు అనేవి మాయం అయ్యి వాటి స్థానములో టెక్నాలజీని వుపయోగించి చేసే కిడ్నాపులు పెరుగుతున్నాయి **[]** ఈ కిడ్నాపుల గురించి ప్రజలు తెలుసుకొని అప్రమత్తంగా ఉండాలన్న ఉద్దేశ్యముతో అమెరికన్ **FBI** వాబు

కొన్ని కేసులను ఉదహరించారు .ఇదేవుద్దేశ్యముతో నేను మీకు వీటిని తెలియ పరుస్తూ వున్నాను <>.

- కిడ్నాపు యొక్క మూలసూత్రం ఏమిటంటే - మనపిల్లలకో మన రక్త సంభందీకులకో ఎదో ఆపద కలిగించి - లేదావారిని చెరపట్టి , మననుండి డబ్బు గుంజు కోవటం .మన వారికి ఎదో ఒక ఆపద కలిగింది అనగానే - ఎదో కొంత డబ్బు పడేసి ఆ ఆపద పోగొట్టుకోవాలని అనిపించటం సహజం . కానీ కాలము లభించినకొద్దీ డబ్బు పారేద్దాము అన్న అభి ప్రాయము సడలి పోయి - ఇంకో మార్గము చూడాలని మనుషులు అనుకుంటారు [] ఏదన్న దుర్వార్త వినగానే మనస్సు బుద్ధి స్తంభించిపోయి - ఎదుటివారు చెప్పినది చెప్పినట్లు చేయటానికి సిద్ధ పడతాము-- అందువలన కిడ్నాపర్లు మనకు ఆలోచించే సమయం ఏమీ దొరక్కుండా ఉండేటట్లు తమ ప్లాన్లు వేస్తారు - అంటే టైం లిమిట్ పెట్టి బెదిరిస్తారు . ఏ కిడ్నాప్/ లేదా మోసము లోనైనా సరే టైం లేదన్న వత్తిడి ఏ మనను డబ్బు వదులుకునేట్లు చేస్తుంది . టైం లేదు అన్న ఫీలింగ్ లోనుండి బయట పది ఆలోచించగలిగితే అనేక మోసాలు అరికట్ట బడతాయి. అని FBI అన్నది .

నేటి సైబర్ కిడ్నాప్ లలో -- నిజమైన కిడ్నాప్ ఏదీ జరగదు .కానీ మోసగాళ్లు మనకు ఫోన్ చేసి " మనపిల్లలో మన రక్త సంభందీకులో ఎదో ఆపద లో వున్నారని - లేదా ఎక్కడో బందీలుగా చెరపట్ట బడ్డారని -- కేవలం ఫోన్ల ద్వారా నే మనని నమ్మించి కేవలం ఫోన్ల ద్వారానే డబ్బు గుంజుతారు . వీటిని సైబర్ కిడ్నాపులు అంటారు .

[]

మొదటి -- సైబర్ కిడ్నాపు మోసము } ఒక చైనా విద్యార్థి అమెరికాలోని ఎదో యూనివర్సిటీలో చదువుకుందా మని వచ్చాడు .ఇతడి రిచ్

పోకడలను చూసిన , కొందరు మోసగాళ్లు ఈ అబ్బాయి మీద కన్నేశారు ఎట్లాగో ఫోను నెంబర్ సేకరించారు . ఈ అబ్బాయికి ఫోన్ చేసి " మేము లోకల్ పోలీసులం - చైనాలో నీమీద ఎదో దేశ ద్రోహం కేసు వేసారుట . ఆ కేసులో నీకు ఉరి శిక్ష విధించారుట . నిన్ను పట్టుకు పోవటానికి చైనా నుండి స్పెషల్ పోలీసులు వచ్చి మమ్ము కలిశారు . నువ్వు వాళ్లకు దొరక్కుండా ఉండాలంటే మేము చెప్పిన చోటుకి పోయి దాక్కో. మీ దేశం పోలీసులు వెళ్ళిపోయినాక మేమె నిన్ను బయటికి తీసుకొస్తాము " అని నమ్మ బలికారు . చైనా లో - విద్యార్థులు ఎదో ఒక ఉద్యమాలు చేయటం - అక్కడి పోలీసులు వీరి వెంట పడటం - ఒక్కోసారి అసలైన వారిని వదిలి వారికీ బదులు ఇంకోరి మీద ఇలాంటి కేసులు పెట్టటం చైనాలో సహజం. కిడ్నాపరులు అలాంటి వార్తల ఆధారంగా తమ పధకం రూపొందించారు .
<> కాబట్టి - అదే అభిప్రాయంతో ఈ అబ్బాయి బెదిరిపోయి వీరు చెప్పినట్లు వినటానికి సిద్ధము అయినాడు .అప్పుడు ఈ మోసగాళ్లు ఈ చైనా విద్యార్థిని తీసుకెళ్లి ఒక చిక్కని అడవి మధ్యలో కి ప్రవేశ పెట్టించారు . దీనికోసం ఒక కిరాయిటాక్సీ ని వాడారు .

" నీ వద్ద వున్నా ఫోన్ ఆన్ చేయకు . సిగ్నల్స్ ఆధారంగా చైనా పోలీసులు నిన్ను పట్టుకో గలరు . కాబట్టి నీ సెల్ఫీలుమాత్రం మాకు పంపుతూ వుండు .వాళ్ళు వెళ్ళిపోయినాక నిన్ను బయటకు తీసుకువచ్చి రక్షించుతాము . నీకు అమెరికన్ పౌరసత్వం ఇప్పిస్తాము " అని చెప్పి ని నమ్మించారు . " ముందుగా నీగురించి నీ తల్లి తండ్రులకు తెలియ పరుస్తాము - వారి ఫోన్ నెంబర్ ఇవ్వు " అని చెప్పి అతని తల్లి తండ్రులఫోను నెంబర్ తీసుకున్నారు . ఈ పనులన్నీ ఆ చైనా అబ్బాయి స్వచ్ఛందంగానే చేసాడు . మోసగాళ్లు - వెనువెంటనే ఈ చైనా అబ్బాయి తల్లి తండ్రులకు ఫోన్ చేసి "మేము అమెరికన్ విద్యార్థులం ,. మీవాడు

ఇక్కడ ఒక ఘోర హత్యా నేరంలో ఇరుక్కుని , పోలీసులను తప్పించుకోవటానికి అని అడవిలోకి వెళ్ళి దాక్కున్నాడు . . ఇంకాస్త చీకటి పడితే అక్కడి  చలి గాలి తీవ్రతకు మీ అబ్బాయి మంచులో గడ్డకట్టుకొని పోయి చస్తాడు .  ఆ అడవిలోని క్రూరమృగాలు మీ అబ్బాయిని తిని వేస్తాయి . పాములు కరిచేస్తాయి . కాబట్టి చీకటి పడక ముందే మాకు ఐదు లక్షల డాలర్లు మనీ ట్రాన్స్ఫర్ చేయండి .ఆ డబ్బు ఖర్చుచేసి -  లాయర్ల ద్వారా మీ అబ్బాయిని రక్షించి - తిరిగి క్షేమంగా  మీదేశము పంపిస్తాము . ఇవిగో మీ అబ్బాయి ఫోటోలు చూడండి. మీరు డబ్బు పంపకుంటే అతని ఖర్మానికి అతన్ని వదిలి వేస్తాము  " అంటూ చైనా కుర్రవాడు - తనకు తానుగా అడవిలో దాక్కుని-  తమకు పంపిన సెల్ఫీలను - అతని తల్లి తండ్రులకు పంపారు .వారు బెదిరిపోయి , ఆ వెంటనే ఈ మోసగాళ్లు అడిగిన సొమ్మును మనీ ట్రాన్స్ఫర్ చేశారు .రు . మోసగాళ్లు తమ సింకార్డు పారవేసి మాయం అయ్యారు .

.

రెండో రకపు సైబర్ కిడ్నాపుమోసము--  ఒకామెకు ఒక ఫోను కాల్ వచ్చింది . ఆమె ఫోను నెంబర్ ని మోసగాళ్లు ఎక్కడనో సంపాదించారు . ఫోన్ చేసిన వాళ్ళు " మీ అబ్బాయి ఇక్కడో కారు కింద పడ్డాడు . బాగా బ్లీడింగ్ అవుతున్నది .మెదడు బయటకు వచ్చింది .   మేము మీ అబ్బాయిని  హాస్పిటల్కి తీసుకు వెడుతున్నాము . మీరు వెంటనే  మూడు లక్షలు మాకు ఫోన్ పే చేయండి . మీ అబ్బాయిని కాపాడుకోండి .ఎక్కువ సమయం లేదు .  మేము పేదవాళ్ళము కాబట్టి మీరు డబ్బు పంపక పోతే - , అతన్ని ఇక్కడే రోడ్డుమీద వదిలేసి వేయాల్సి వస్తుంది " అని చెప్పారు .

తల్లి తండ్రులు డబ్బు పంపారు . మోసగాళ్లు తమ సింకార్డు పారవేసి మాయం అయ్యారు .

మూడో రకపు సైబర్ కిడ్నాపుమోసము-- ఒక స్త్రీకి ఒక ఫోను కాల్ వచ్చింది . ఆ ఫోను నెంబర్ ని మోసగాళ్లు ఎక్కడనో సంపాదించారు . ఫోన్ చేసిన వాళ్ళు అన్నారు " మీ అమ్మాయిని మేము కిడ్నాప్ చేసాము . కావాలంటే ఆమె మాటలు - ఏడుపులు వినండి . మీరు ఐదు నిమిషాల లోపున ఐదు లక్షలు ఫోనుద్వారా పంపక పోతే ఆమె చేతికున్న ఐదు వేళ్ళు కత్తిరించి మీకు పంపిస్తాము "అని .ఈ మాటల వెనుక ఏడుస్తున్న ఆడపిల్ల గొంతూ రక్షించమంటూ ఆర్తనాదాలు వినిపిస్తాయి .తల్లి ఆ గొంతు తన కూతురిదేనని తల్లికి అనిపిస్తుంది కంగారు వల్ల . అందువల్ల వెంటనే డబ్బులు పంపించి తన కూతురును వదిలివేయమని వేడుకుంటుంది . నిజానికి- ఈ ఏడుపూలు /లేదా రక్షించండి అన్న ఆర్తనాదాలు ఏ ఆడపిల్లవీ కాదు ఆడపిల్ల ఎవరూ కిడ్నాపర్ వద్ద వుండరు . ఈ మోసగాళ్లు ఇంటర్నెట్ లో వుండే వీడియోలలో ని - **TIKTAAK** షో లో ని - రీల్స్ వంటి వాటిలో నూ వుండే స్త్రీల గొంతులు అనేకం సేకరించి వాటిని ఆర్టిఫీషియల్ ఇంటిలిజెన్స్ ద్వారా మార్పు చేసి -ఆ గొంతులను ఏవో ఆపదల్లో వున్న స్త్రీలు/ యువతులు / పిల్లలు మాట్లాడుతున్న వాటిలాగా మారుస్తారు . పానిక్ లో ఉన్న తల్లి తండ్రులు ఆ గొంతును సరిగా పోల్చుకోలేరు . మన పిల్లలు ఆపదలో వున్నపుడు ఎలా స్పందించి ఎలా అరుస్తారో అనేది మనకు అలవాటు అయిన విషయము కాక పోవటం మరో కారణం .

పై మూడింటిలో కిడ్నాప్ లక్షణాలు ఐన ఆపద - దానికి విరుగుడు గా డబ్బు అనే అంశాలు వున్నవి . కిడ్నాప్ లక్షణాలతో నే ఉండి- కిడ్నాప్

అనటానికి వీలు లేని దాన్ని సైబర్ కిడ్నాప్ అంటారు. ఇందులో ఫ్యజికల్ గా చేసిన కిడ్నాప్ నేరము ఏమీలేదు .పూర్తిగా మాటల మోసమే వుంది .. కిడ్నాప్ తో పోలిస్తే మోసం చేసిన నేరానికి పడే శిక్ష తక్కువ . అందువల్ల ఒకవేళ మోసగాళ్లు దొరికితే వారికి పడే శిక్ష కూడా చాలా తక్కువ . అందువల్ల ఇప్పటి మోసగాళ్లు నిజమైన కిడ్నాప్ఏదీ చేయకుండా సైబర్ కిడ్నాప్ లు మాత్రమే చేస్తూ వున్నారు .

# మా అమరావతి అమ్మమ్మకు జాబు ఇచ్చారు . 24-01-24

అమరావతి లో వున్నా మా అమ్మమ్మకు వుద్యోగం ఒక వుద్యోగం వచ్చింది అని తెలియగానే - అది తెలిసిన వాళ్ళు అందరూ నోరు వేళ్ళ బెట్టారు " నూరుసంవత్సరాలకు దెగ్గర పడి - తన పని ఎదో తానూ చేసుకుంటూ - వినేవారికి - వినని వారికి ఏవో అచ్చట్లు ముచ్చట్లు చెపుతూ తిరిగే మా అమ్మమ్మకు ఈ వయసులో జాబు రావటం ఏమిటని? నేనూ ఉద్రేక పడ్డాను .

ఈ రోజుల్లో ఉద్యోగం రావటానికి - వయసుతో పని లేదని -మంచి మెమరీ వున్న బుర్ర ఉంటే చాలని - నేను అనేక సందర్భాలలో తెలుసుకున్నాను . మా అమరావతి అమ్మమ్మ అచ్చట్లు ముచ్చట్లు చక్కగానే చెపుతుంది కాబట్టి - ఆమె బుర్ర సక్రమంగా వున్నది అనే కదా ? కాబట్టి ఆ బుర్రని చూసే ఎవరో ఎదో జాబు ఇచ్చారని ఊహించాను .

గత శని ఆదివారం లో ఆమెను కలిసి - ఆమె బ్లెస్సింగ్స్ తీసుకొని - కొన్ని సంగతులు తెలుసుకున్నాను . వుద్యోగం ఇచ్చిన వారు ఇంగిలీషు వారు .

వారు ఒక స్టార్ హోటల్ లో మా అమ్మమ్మను ఇంటర్వ్యూ కూడా చేశారు . తరువాత సంవత్సరానికి ఒక లక్ష డాలర్లు అంటూ ఒక అపాయింట్ మెంట్ లెటర్ కూడా ఇచ్చారు .

" నిన్నేమీ ప్రశ్నలు అడిగారు "

" నన్నేమి అడుగుతారురా ? నాకు అన్నీ తెలుసునా యే -- అందుకని ఒక హెడ్ ఫోన్ నా చెవులో పెట్టి కొంత సంగీతం వినిపించి - తదుపరి కొంత ఏడుపులు - ఆపై కొన్ని కేరింతలు వినిపించారు . మొదటిది హిందూస్తానీ సంగీతము అని రెండోది చిన్నపిల్లల ఏడుపులు -అని మూడోది చిన్న పిల్లల కేరింతలు అని నేను టక్కున చెప్పాను. దానితో వారు నాకు జాబిచ్చి పంపారు "

" నువ్వేం చేయాలో నీకేమన్నా చెప్పారా ?"

" వాళ్ళ టీం ఎక్స్పర్ట్ వచ్చి పని అప్పగించుతారని చెప్పారు "

ఇక మా అమ్మమ్మ దెగ్గరనుంచీ తెలిసేదేమీ లేదని - బెంగుళూరులో వున్న మా అమ్మమ్మ ఆఫీసుకు ప్రయాణం అయి వెళ్ళాను .

పెద్ద భవంతిలో ఆ ఆఫీసు వుంది . ఎంతో రిచ్ గా వుంది .వీళ్ళు మా అమ్మమ్మకు ఏదన్న టోపీ వేస్తారా? ఏమిటి అని ఆలోచించాను . కానీ మా అమరావతి అమ్మమ్మ దెగ్గర డబ్బూ దస్కం అనేది ఏమీలేదు. ఇప్పటికీ ఒక రూపాయి నే నా చేతిలో పెడుతుంది . ఆమె దృష్టిలో రూపాయ అంటే అరపై డాలర్లకు మించి ఇంకా ఏంటో ను.

" మీరు మీ అమ్మమ గారి వివరాలు చెప్పండి . ఆ వివరాలు మాదెగ్గర వున్న వివరాలతో సరిపోతే - మీరు ఆమె తరఫు వారని నమ్మి - మీ

సందేహాలకు నేను సమాధానము ఇస్తాను " అని ఆ ఆఫీస్ ఆయన అన్నాడు .

" మా అమ్మమ్మ అంటే నిజంగా మా అమ్మకు అమ్మ కాదండి .మా అమ్మకు అక్క . ఆమె చిన్నతనం లోనే భర్త మరణించాడు . పిల్లలు లేరు . అందువల్ల తన అన్నల - అక్కల - చల్లెల్ల ఇండ్లలోను - అటు భర్త తరఫు వారి ఇండ్లలోను ఎవరు ప్రసవం అయినా బాలింతకు తోడుగా ఉండేదుకు ఈమెను పిలుచుకు పెడుతుండే వారు . ప్రసవానంతరం నెలో , ఆరు నెలలో తల్లి పిల్లలకు సేవచేస్తూ కాలం గడిపేది . మా అమ్మమ్మ తన ఇరవై లో మొదలెట్టి ఇప్పటి వరకూ ఎందరి కానుపులను చూసిందో - ఎందరు చంటి పిల్లలను సముదాయించిందో లెక్కలేదు " అని నేనుఅన్నాను .

" ఎన్ని ? అంటే ఒక రొండు వందలు ఉంట వా ?" అని అయన అడిగాడు .

ఖచ్చితముగా ఉంటా వి అని నేను అన్నాను .

" అంత మంది చంటి పిల్లలను పెంచి పెద్దచేసిన ఆమె అనుభవం చూసే మేము జాబు ఇచ్చాము - ---- మాది ప్రపంచంలోని అతి పెద్ద ఆర్టిఫిషల్ ఇంటిలిజెన్సీ {ఏ . ఐ} కంపెనీ . ఈనాడు చాలామంది ప్రొఫెషనల్స్ పిల్లలను కంటూ వున్నారు గానీ - ఆ పిల్లలు ఒక్క క్షణం ఏడ్చినా గానీ ఓర్చుకోలేక పోతున్నారు .తట్టుకోలేక పోతున్నారు . తమ నిద్ర మరియూ మూడ్ చెడి పోతున్నదని -- పిల్లలని కిటికీ లోనుండి బయటకు వేయాలని ఆలోచించిన వారు కూడా వున్నారు - . చివరికి ఏడుస్తున్న చంటి పిల్లాడితో ఏమి చేయాలో తెలీక వాడిని సూపర్ స్పెషలిటీ హాస్పిటల్ కి తీసుకు పెడుతున్నారు . ఇందుకు బోలెడు డబ్బు, బోలెడు సెలవులు- ఖర్చు అవుతున్నవి . అందుకని ఐటీ ప్రొఫెషనల్స్ - మరియు ఇతర బిజీ జంటలు

ఉపయోగించుకుందుకు వీలుగా మేమొక పరికరాన్ని రూపొందించాము . చంటి పిల్లల ఏడుపు ను ఈ పరికరానికి వినిపిస్తే -- ఆపిల్లవాడు ఎందుకు ఏడుస్తున్నది ? అనేది మా పరికరం చెపుతుంది . చంటి పిల్లవాళ్ళు ఎందుకు ఏడుస్తున్నది అన్న సంగతి మీ అమ్మమ్మ లాంటి వాళ్ళు మాకు చెబితే అది మేము తెలుసుకుంటాము .అవతలి వాళ్ళు మాపరికరాన్ని ఆన్ చేసి వాళ్ళ పిల్లల ఏడ్పు వినిపించగానే - మా పరికరం ఆ ఏడ్పును మా కంప్యూటర్ కి పంపుతుంది . మా కంప్యూటర్ ఆపరేటర్ - ఆ ఏడుపు మీ అమ్మమ్మకి వినిపించి ఆమె అభిప్రాయం అడుగుతుంది . ఆ అభిప్రాయాన్నే మేము తిరిగి మా పద్దతిలో ఆ ఏడ్చే పిల్లల తల్లి తండ్రుల వద్ద వున్న పరికరానికి తెలుపుతాము . ఇదంతా నిమిషాలలో జరిగి పోతుంది . మా పరికరం ద్వారా పిల్లాడి ఏడుపుకు అర్థం ఏమిటో? అన్నది తల్లి తండ్రులు నిమిషాలలో తెలుసుకుంటారు . ప్రపంచ వ్యాప్తంగా మా పరికరం కొన్నవారు, కోట్లాది మంది వున్నారు . ఇపుడు మా సక్సెస్ రేటు **99 %** వున్నది . ఆదాయముకూడా కోట్ల డాలర్లలో వున్నది. పిల్లల ఏడ్పులు విని వాళ్ళు ఎందుకు ఏడుస్తున్నది ? మాకు ఖచ్చితంగా తెలియ చెప్ప గలందులకు అని మీ అమ్మమ్మకు జాబు ఇచ్చాము . జీతము లక్ష డాలర్లుఅన్నది కూడా నిజమే ను ." అని అయన అన్నాడు .

" బాగుంది - మా అమ్మమ్మకు రెండు వందలకు పైగా చంటి పిల్లల ఏడ్పులు విని దానికి కారణము ఏమో కనిపెట్టి - వారిని సముదాయించి నిద్రపుచ్చటంలో ఎంతో అనుభవం వుంది . అది మీరు క్యాష్ చేసుకుంటున్నారు . సరే సంతోషం .మా అమ్మమ్మ సాల్వ్ చేసిన మంచి కేసు ఒకటి చెప్పండి . విని సంతోషిస్తాను " అని అడిగాను .

" హాలీవుడ్ లో టాప్ హీరో గారు మా క్లయింట్ . అంటే మా పరికరం కొన్నవాడు . రేపు బిజీ షూటింగ్ షెడ్యూల్ వుంది అనగా, అయన సరిగా నిద్రపోవటానికి వీలు లేకుండా వాళ్ళ చంటోడు ఏడుపు అందుకున్నాడు . పిల్లాడిని తల్లికి వదిలేసి వేరే గా పోయి పడు కోటానికి అయన తండ్రి మనస్సు ఒప్పలేదు . అయన మా పరికరం ద్వారా ఆ ఏడుపు మాకు వినిపించి మా సలహా అడిగాడు. .ఈలోపు పెద్ద డాక్టర్ గారికి గూడా పిల్లాడిని చూపించారు . పిల్లాడి ఏడుపుకు కారణం ఏమిటో ఆయన కూడా చెప్పలేక పోయాడు . ఈలోపు మేము మీ అమ్మమ్మ గారికి ఆ ఏడుపు వినిపించి పిల్లాడి ఏడుపుకు కారణం ఏమిటో ఊహించి చెప్పమని అడిగాము . " పిల్లడు తల్లి పాల రుచి కోసం " ఏడుస్తున్నాడు అని మీ అమ్మమ గారు చెప్పింది . అంతే -- పిలాడికి తల్లి పాలు అందగానే వాడు ఏడుపు మాని కిలకిలా నవ్వాడు . ఈ వార్త ఆ హాలీ వుడ్ నటుని మూలకంగా అమెరికా అంతా పాకి , మాకు కుప్ప తెప్పలుగా ఆర్డర్లు వచ్చి పడ్డాయి .మీ అమ్మమ్మ లాంటి వారే మా కంపెనీకి వెన్నెముక .ఆమెకు ఇంకా జీతము పెంచుదాము అని పరిశీలిస్తున్నాము " అని అయన అన్నాడు .

' కేవలం అమ్మమ్మలకేనా ? నానమ్మల కు కూడా జాబిస్తారా ?

" అమ్మమ్మలకే ఫస్ట్ ప్రిఫెరెన్సు - ఎందుకంటే మనుమళ్ల - ముని మనుమళ్ల -ఇంకా వీలుంటే వారి పిల్లల ను సముదాయించే పని భాద్యత అమ్మమ్మలు మాత్రమే నెత్తికెత్తు కుని నెరవేరుస్తారు . అలాగా వారికీ ప్రాక్టికల్ అనుభవం ఎక్కువ . కాకపోతే రొండువందల మంది కి పైగా చంటి పిల్లల ఆలనా పాలనా చూసిన రికార్డు వున్న ఎవరికైనా మేము ఈ జాబు

ఇస్తాము - ఇంకా ఎవరన్నా ఉంటే ఇంట్రడ్యూస్ చేయండి " అని అయన అన్నాడు .

అనుమానంలు అన్నీ తొలగి పోగా - అమ్మమ్మల గొప్పతనం గుర్తించాను . మీరూ గుర్తించే వుంటారు . మీ అమ్మమ్మ ఉంటే చెప్పండి జాబు ఇప్పిస్తాను .

వారణాసి శ్రీ రామ కృష్ణ- అమరావతి - కల్పానిక రచన

## చెప్పాల్సిన విధంగా చెప్పాలే .. 26-1-24

మావూరు అమరావతిలో ముదునూరు రామారావుగారని ఒక మాష్టారు వున్నారు . అయన బండ పారిన మొండి పిల్లలను మెట్రిక్యు లేషన్ పాస్ చేయించటంలో ఉద్దండుడు . " చెప్పాల్సిన విధంగా చెప్పాలే " అన్నది ఆయన నినాదాము . ఆరోజుల్లో మెట్రిక్యు లేషన్ అయితే బిళ్ళ బంట్రోతు పనో - మిలటరీ జవాను పనో - ఇలా ఏదోక ప్రభుత్వ వుద్యోగం దక్కుతుంది అనుకున్న వారు వారి మొద్దు పిల్లలను మా మాస్టారు గారి దగ్గర చేర్చేవారు .వాళ్ళు రెండు మూడు రెండ్లలోనైనా మెట్రికులేషన్ పాస్ అనని పించుకునే వారు .

మా మాష్టారు గారిని - మావూరి జమీందారు గారు పిలిపించారు . వూరిలోవున్న అమరేశ్వర స్వామి ఆలయాన్నీ నిర్మించిన వారికి ఈ జమీందారు గారు వారసులు - ఆ రకంగా వారు గుడికి యజమాని కూడా .

జమీందారు గారు మా మాస్టారుతో " చెప్పాల్సిన విధంగా చెప్పాలే .. అన్న మీ నినాదం మా దాకా వచ్చింది - మాకు నచ్చింది . మన అమరేశ్వర స్వామి గుడి గోపురముల మీద అనేక పావురములు వాలి గూళ్ళు పెట్టి -

తమ రెట్టలతో ఆలయ ప్రాంగణము అంతా రొచ్చు రొచ్చు చేస్తున్నవి - మాకు చికాకు కలిగిస్తున్నవి .మీరు వాటికి చెప్పాల్సిన విధంగా చెప్పి మా గుడి ప్రాంగణం వీడి పోయేట్లు చేయండి - బహుమానంగా మీకు ఒక ఇంటిని సమకూరుస్తాము "

అని అడిగారు .

అప్పుడు మా మాష్టారు " ఆ పావురముల మీదకు - మీ వాళ్ళు - బాణాలు రాళ్ళూ వంటివి వేసి వాటి గూళ్ళను పడద్రోసి - వాటిని పారత్రోలాలని ప్రయత్నించే ఉంటాబు. పావురాళ్ళు శాంతి కాముకులు . మనము వాటిపట్ల హింసా మార్గం పట్టామా అవి కూడా అదే మార్గంలో బదులిస్తాయి . అంటే మరిన్ని రెట్టలు వేస్తవి .పిట్టలన్నింటికీ వాటి సామూహిక బలము ఉంటుంది . అవి తమ సమూహాలని పిలిపించుకొని మరింత అల్లరి చేసి మరింతగా రెట్టలు వేసి - వాటి నివాస స్థలాన్ని వదిలి మనమే వెళ్లి పోయేట్లుగా చేస్తాయి . అందువల్ల మీరు అన్నట్లు వాటికి చెప్పాల్సిన విధాన ప్రకారము చెబుదాము " అన్నారు మేష్టారు గారు .

పై తరువాయి మా మాష్టారు కుమ్మరి వారిని పిలిపించి వారి చేత పింగాణీ గుడ్లు తయారు చేయించారు .ఇక చెప్పాల్సింది ఏముంది ? ఆ గుడ్లు రంగులోను - సైజు లోను అచ్చు పావు రాయి గుడ్ల మాదిరిగా నే వున్నాయి . మొత్తము పాతిక గుడ్ల ను కొండి . మా మాస్టారు ఈ పింగాణీ గుడ్లను తీసుకు వెళ్లి - గుడి ప్రాంగణం లో పావురాలు నివాసం పెట్టిన గోపురం కింద భాగంలో వుండే నేలపై చెల్లా చెదురుగా దొర్లించారు . ఈ దొరలింపు అనేది బాగా చీకటి పడ్డాక -పావురాలు ఆదమరిచి నిద్రించాక జరిగింది . మరునాడు మా మాస్టారుగారే వెళ్లి - ఆ పింగాణీ గుడ్లను ఒక్కొక్కటి గా ఏరి ముక్కుతో వాసన చూసి - తన పంచెలో మూట కట్టుకున్నారు .

ఈ గుడ్ల కలెక్షన్ సూర్యుడు తెల తెల వారుతుండగా నూ - పావురాలు ఇంకా మేతకు బయలు దేరకముందూనూ జరిగింది . ఈ గుడ్ల కలెక్షన్ ని - పావురాలు కనిపెట్టాయని వేరే చెప్పక్కరలేదు . ఎందుకంటే పావురాలు ఎంతో తెలివి కలవి . ఎన్నో తెలుసుకొని - ఎన్నో గుర్తుంచుకొని - ఆలోచనలలో పెట్టుకుంటాయి . వీటి కి అల్లాంటి తెలివిఉండపట్టే వీటిని టపా పంపటానికి వాడు తుంటారు .

నకిలీ గుడ్లు దొర్లించటం - తిరిగి వాటిని కలెక్ట్ చేయటం అన్నది వరుసగా నెల రోజుల పాటు సాగింది .క్రమంగా పావురాలు అన్నీ గుడి ప్రాంగణం వీడి ఎక్కడికో పోయాయి . మళ్ళీ రాలేదు .

పావురాలు నిజంగానే వెళ్లి పోయాయని మా జమిందార్ గారు నమ్మాడు . " మీరు వాటికి ఎల్లా చెప్పాలో అల్లాగే చెప్పారు . ఇంతకీ మీరేమి చెప్పారో ?? "అంటూ జమీందారు గారు తన సంశయం వెలిబుచ్చారు .

సంశయం తీర్చక పోతే - జమీందారు గారు ఇల్లు ఇవ్వరేమో అని ఏమో మా మాస్టర్ గారు ఇలా బదులిచ్చారు . " మనుషులకు తాము మరణిస్తామన్న సంగతి తెలుసు . ఆ సంగతి ఎంతో సహజం కాబట్టి అది మానవులకు ఎక్కువ దుఖ్ఖము ఇవ్వదు . కానీ అదే తమ పిల్లల విషయానికి వచ్చినపుడు చావు సహజం అనుకోరు . పిల్లలకి నీళ్లు పడలేదు . గాలి పడలేదు . అంటూ వున్నా చోటువీడి ఎక్కడెక్కడికో వెడతారు .వారికోసం ఎన్నో చేస్తారు . ఇక నేను నకిలీ గుడ్లు ఏరటం చూసి న పావురాలు - తమ పిల్లలు అవ్వబోయె గుడ్లు - ఎందుచేతనో తమ గూళ్ళ నుండీ జారి కిందపడుతున్నవి అని- మనుషులు వచ్చి భూతదయ మరియు జాలితో తిరిగి వాటిని

గూళ్ళల్లో పెట్టటానికి బదులు - చక్కగా వాసన చూసి ఏరుకుని , తినటానికి తీసుకు వెడుతున్నారని అవి అనుకున్నవి . అప్పటికి ఇంకా గుడ్లు పెట్టని పావురము - తాను పెట్టిన గుడ్లు లెక్కకు సరిపోయాయి అనుకున్న పావురము లాంటివి కూడా జరుగుతున్నది చూసి " మనవి కాక పోయినా - మన వారి గుడ్లు ఎవరివో ఏమో ? కొన్ని కింద పడ్డవి . ఇవాళ వారి గుడ్లు కోల్పోయినట్లు - రేపు మనము కూడా మన పిల్లగుడ్లను కోల్పోవచ్చు . ఎందుకో కానీ ఈ చోటు మనము గుడ్లు పెట్టటానికి - వాటిని పొదిగి పిల్లలను చేయటానికి తగిన ప్రదేశము కాదు అనుకున్నవి . ఈ రకముగా పావురాలు - నేను చేసిన పనిని విశ్లేషించుకుని అర్ధం చేసుకొని - తమ పిల్లలకు ఇది సేఫ్ జోను కాదు అనుకుంటూ - వేరే చోట్లకు వెళ్లి పోయాయి . ఒక పావురానికి తెలిసిన విషయం - దాని జాతి పక్షులకు - దానిపిల్లలకు - ఆపిల్లల పిల్లలకు తరతరాల పాటు తెలుస్తుంది . భగవంతుడు వాటిని ఆలా సృష్టి చేసాడు . అందువల్ల ఇక మన గుడి ఛాయలకు పావురాలు రావు " అని మా మాస్టారు గారు చెప్పారు .

" అయితే పావురాల జీవిత విధానము - అవి ప్రవర్తించే తీరు - సృష్టి వాటికి ఏర్పరిచిన మనస్తత్వము గురించి నాకు ఇంకనూ వివరించండి . " అని జమీందారు గారు కోరారు .

" నా దేవతార్చనకు వేళా మించిపోతోంది . వెళ్లి వస్తాను .తమరు తీరికగా వున్నపుడు నాకు కబురంపండి - అలాగే తీరిన వేళా నాయింటిని గురించి కూడా ఏదన్న ఆలోచించండి " అని బదులిచ్చి మా మాస్టారు గారు ఇంటికొచ్చి పడ్డారట .

పావురాల గురించి మీరుకాస్తో కూస్తో తెలుసుకుంటే పైదంతా నిజంగా జనిగిందా ? ఏమీ ?అన్నమీ అనుమానము పోతుంది .

పై సంఘటనను అమరావతిలోని సంస్కృత కవి ఆంజనేయులు పంతులు గారు సంస్కృత శ్లోకాలలో అక్షర భద్దము చేయగా - మా అన్నగారైన వెంకటేశ్వర శర్మ గారు - ఆ శ్లోకాలలో ని కథను నాకు వినిపించగా - నేను - అనగా వారణాసి శ్రీ రామకృష్ణ - అనేవాడిని దాన్ని తెలుగులో రాసి మీకు చూపెట్టాను .

## మా నానమ్మ ప్రేమలో .. 27-01-24

మొదటి మాట ఏమిటంటే నానమ్మ ప్రేమలు - అమ్మమ్మ ప్రేమలకు డబల్ రెట్లు వుంటాయి .కానీ మనం కనిపెట్టను బద్దకిస్తాము .
పండుగతో పాటు మా నానమ్మ ప్రేమ కూడా ఉంటే బాగుంటుందని మేము అంటే మాపెద్దనాన్న గారి పిల్లలం మరియు బాబాయి గారి పిల్లలం మొత్తము కలిపి - ఫది మంది కల కోతిమూక - మా నానమ్మ గారి ఇంటిలో జమ అయినాము . ఒక పండుగకు అటు, ఒక పండుగకు ఇటు అంటూ మా అమ్మలు నియమం పెట్టుకోవటం వల్ల ఇలా జమ కావటం జరిగింది .లేక పోతే ఎట్లా ఉండేదో ?

మేము అప్పుడెప్పుడో వెళ్ళిపోయిన సంక్రాంతికి మా నానమ్మ గారి వూరు వెళ్ళాము . మా నానమ్మ ఇల్లు పెద్దది . .ఇంటి చుట్టూతా ప్రహరీ . ఈ ప్రహరీ లోనే , రొండు కొబ్బరి చెట్లు , పున్నాగ చెట్లు , మామిడి చెట్టు , జామచెట్టు , చింత చెట్టు , వేప చెట్టు బాదం చెట్టు ఉంటవి . చిక్కుడు పందిరి , దొండకాయల పందిరి , పొట్లకాయల , బీర, కాకర కాయల పందిళ్లు కూడా ఉంటవి . నేలమీద బెండకాయల చెట్లు , వంకాయల చెట్టు , టమోటాలు చెట్టు పచ్చి మిర్చీ చెట్లు కూడా ఉంటవి . ఇక నేల మీద పాకుతూ గుమ్మడి తీగలు దోసతీగలు కూడా ఉంటవి . ఇంకా ఎన్నో పూల

మొక్కలు కూడా వున్నవి . ఇన్ని వున్నవి అని చెప్పేదానికి కారణం - మా నానమ్మ ఇంటి వెనుక ఎంత చోటు వున్నదో చెప్పాలని చెప్పటమే .ఇన్ని చెట్లు ఇంత చోటు వున్నా ఇల్లు మా పిల్లలపాలిట స్వర్గధామము . ఎన్ని ఆటలైనా ఆడుకోవచ్చు .కోతులల్లే చెట్లు ఎక్క వచ్చు . ఎన్ని కోర్కెలయిన తీర్చు కోవచ్చు .

చిన్న పిల్లలకు కోర్కెలు ఏముంటాయంటారా ? మాకు నచ్చిన వంకాయ లో / బెండకాయలో /బీరకాయలో ఇలా ఏవో ఒకటి తెంపి తీసుకు వెళ్లి మా మా నానమ్మ కి ఇస్తే చాలు - జస్ట్ మాకోసమనే వాటిని కమ్మని కూరగా వండి - ఎవరి కూర వారికి వేసేది . ఒకే కూర అనే లిమిట్ కూడా లేదు . మనము ఎన్ని రకాల కూరలైనా తెచ్చుకోవచ్చు- మా నానమ్మ కాదనేది కాదు . తోటి పిల్లలందరి మధ్యా కూచుని - కేవలం మనకంచము లో నే వుండి , మరెవరి కంచం లోనూ లేని కూర తినటం లో ఎంతో మజా ఉంటుంది .అది మా మా నానమ్మ వల్లే సాధ్యం అయ్యేది .

ఇక మా మీసాల తాతయ్య అంటే మా మా నానమ్మ గజగజ లాడిపోయేది . ఒకేసారి మా నానమ్మ ఆయనకు కంచు చెంబుతో మంచినీళ్లు ఇవ్వగా అందులో ఎదో నలక కనపడ్డది. ఆయన ఆ చెంబును నేలకేసి కొట్టాడు కొబ్బరి కాయను కొట్టినట్లు . ఆ చెంబు ఆరు ముక్కలైంది . అదీ ఆయన కోపము ధాటి .

ఆయన మానానమ్మను కావాలని ఎప్పుడూ ఏమీ భయపెట్టే వాడు కాదు . భయపడు అన్నట్లు ఆక్షన్ చేసేవారు . కానీ మా నానమ్మే భర్త మీద గౌరవం కొద్దీ - సంప్రదాయం కోసమని, ఎందుకైనా మంచిదని ఆయనకు - ఎదురు నిలబడి మాట్లాడేది కాదు .

అప్పుడెప్పుడో వెళ్ళిపోయిన సంక్రాంతికి    అని కదా? కథ  మొదలేసాను.
ఆ పండుగమొదటి నాడు   మేము పిల్లలం అందరం   భోజనాలు చేసి
బొర్రలు నిమురుకుంటూ , వరుస కట్టి పడుకున్నాము.

మా మీసాల తాత పొలం పనులు ముగించుకొని అన్నానికి  ఇంటికొచ్చాడు
.

" మీ కేవేళ అన్నం పెట్టను " అని మా నానమ్మ  భీష్మించుకొని కూచుంది
.మా నానమ్మ ఇలా అన్నదని తెలిస్తే - ఇంటికోడళ్ళ మధ్య ఆమె పరువు
పోవటం ఖాయం గదా ?

మా తాతయ్య అడుగగా అడుగగా " మీరు పిల్లలకి ఏమి చెప్పారు ? పెరట్లో
నల్ల నాగు పాము తిరుగుతున్నది . అటు పోవద్దు అని చెప్పారా లేదా ?
దానితో పిల్లలు బెదిరి

పెరట్లోకి పోయి కోటి కొమ్మచ్చిలు  ఆడుకొకుండా మునగ దీసుకొని
కూచున్నారు .ఆడపిల్లలు పూలు తెచ్చుకొని మాలలు కట్టుకోలేదు .
ఎవరికీ ఏ  కూరలు ఇష్టమో ఆ కూరలు తెచ్చుకోలేదు . ఎదో తిన్నారు . అది
పండగ తిండి కాదు  ఒక పాడూ కాదు . వాళ్ళ అల్లరీ హడావుడీ లేకపోతే
పండగ చచ్చినట్లున్నది .   మనకీ పండగ లేదు కాబట్టి - మనము ఈ రోజు
పస్తుందాము " అని మా నానమ్మ  ఖరా ఖండీగా చెప్పింది .

" నన్నేమీ చేయమన్నావ్ ?" అని మా తాత రుసరుసలాడారు .

" ఆ పామును చూసిన రోజునే చంపాల్సింది . లేదా ఆ  రోజునే నాతో
అనాల్సింది  "

" ఇవాళ చంపిస్తాను - పాముకు మంత్రం వేయిస్తాను - ముందు అన్నము పెట్టు ఫో "అని అయన ఉరిమాడు . మా నానమ్మ తగ్గేదే లే అన్నట్లు అట్లాగే నుంచుంది .

మా ఆనందంకోసమని మా తాతతో తగవు పెట్టుకొన్నా మా నానమ్మ - తన మాట మీదనే గంటకు పైన నిలబడింది . తాతకు అన్నము పెట్టలేదు .చివరికి మా తాత ఇన్ని మజ్జిగ తాగి - పలుగు ,పారా కర్రా చేతపుచ్చుకొని పెరట్లోకి వెళ్ళాడు . అయన వెనుకనే మా నానమ్మ కూడా వెళ్ళింది .మమ్మల్ని రావద్దని తలుపులేసింది .

చివరికి అంటే సాయంత్రం అయ్యేలోపు -మా తాత - మా నానమ్మ కలిసి ఆ కన్నము ఈ కన్నము పొడిచి - నాలుగు పాములను చంపి తెచ్చి ఒక చోట పడేసాడు . మేము చూడాలని . మేము భయం భయం గా వాటిని కనులారా చూసి - తోటలో కి పరుగెత్తాము .అంటే మేము మామూలు పిల్లలమైనామని దీని అర్ధము. రాత్రి బోజనం లోకి పొట్ల పిందెలు తెంపాము . కూరలు కోసాము .

తన మనుమల కోసం అని మా నానమ్మ పాముని కూడా లెక్క చేయకుండా- తాతతో పాటు తానుకూడా పెరటిలోకి వెళ్ళింది . ఆమెకు ఎమన్నా అయితే ?తాతకు ఎమన్నా అయితే ? ఆమెకు ఏమీ లెక్కలేదా ?

మా కోసమని మా తాతయ్యతో మంకు పట్టు పట్టి ఆయన్ను లొంగ తీసిన నానమ్మ అంటే - పిల్లల కోసం నాన్నను లొంగదీసే అమ్మతో సమానము .

అమ్మమ్మలు బాల్యానికి వెన్న లాంటి మనస్సు నిస్తే - నానమ్మలు అంటే బాల్యానికి వెన్నెముకలు ఇస్తారు . .తమ మనుమలు ధైర్యస్తులుగా పెరగాలని వీరు కోరుకుంటారు . ధైర్యమే జీవితానికి శ్రీరామా రక్ష ..కదా ?

ఇది వారణాసి శ్రీ రామ కృష్ణ -అమరావతి కధ.

## థాంక్ యూ  భాయ్ నువ్వేమీ చేయకపోవటమే మంచి దైంది  .09-01-24

గిరీశం అనబడే మన గిఱి   గాడు - అందాల అప్సరస బుచ్చెమ్మ కౌగిలిలో  కులికి .  కాపురం వెలిగించటంలోని మర్మాలన్నీ తెలుసుకున్నాడు . ఇంకొన్ని తెలవ వలసి  ఉన్నది అంతే . బుచ్చెమ్మ అనే బుచ్చి--  ఇంకా అట్లాగే గడుసు అమాయకం గా వుంది .

కాపురం వెలగబెట్టే దానిలో భాగంగా మన గిరి గాడు బుచ్చెమ్మ తెమ్మన్న  జాకెట్ కోసం అని టైలర్ దెగ్గరికి వెళ్ళాడు. బుచ్చెమ్మ కొన్నది **100** రూపాయలు దాన్ని డిజైనర్ జాకెట్ గా కుట్టినందుకు టైలర్ గాడికి ఏడు వందలట . కాపురం లోని ఈలాంటి  మార్మిక ఖర్చులు  మన గిరి గాడ్ని  ఎంతో మానసిక వేదనకు గురి చేస్తూ వున్నది . ఇహ టైలర్ చూస్తేనెమో " ఇదిగో రేపు - అదిగో రేపు" అని మూడు నెలలుగా తిప్పుతున్నాడు .ఇంటికి టైలర్ షాప్ కి సైకిల్ తొక్కీ తొక్కీ మన గిఱి గాడి పిక్కబలం లో బొక్క పడుతూ వున్నది .

మన గిరి గాడ్ని  చూడగానే టైలర్ బాబు జీ ఏమన్నాడంటే " సార్ - పండగ బట్టల హడావిడి వుంది - ఎట్లైనా సరే -- రేపు జాకెట్ కట్ చేసి ఎల్లుండి కుట్టి   ఇచ్చేస్తాను- మారెమ్మ మీద ఒట్టు

"అన్నాడు

అప్పుడు మన గిఱి గాడు " థాంక్ యూ  భాయ్ నువ్వేమీ చేయకపోవటమే మంచి దైంది. ఈ మూడు నేలల్లోనూ మా బుచ్చెమ్మ

పెరిగి పెద్దది అయింది .ఆంటీ అయింది. బాగా వూరింది . నీ దగ్గర వున్నా కొలతలతో జాకెట్ కుట్టి ఉంటే అది దేనికీ చాలేదు కాదు - అందువల్ల జాకీట్ వెనక్కి ఇచ్చేయి " అన్నాడు . టైలర్ గారు ఇచ్చేసాడు .

ఇంటికి వచ్చి నాకా మన గిరి గాడు బుచ్చెమ్మ కి జాకెట్ వాపసు ఇచ్చేసి " నేను టైలోరింగ్ నేర్చుకొని - నీకోసం జాకెట్ కుట్టేస్తాను " అని చుట్ట సాక్షిగా ప్రమాణం చేసాడు .

మన బుచ్చి ఎమన్నాడంటే " థాంక్స్ అండీ-- వాడు ఏమీ చేయకపోవటమే మంచి దైంది. ఇప్పుడు ఈ రంగు లో ఉన్న జాకెట్ అప్పుడు ఫాషన్ కానీ ఇప్పుడు ఫాషన్ కాదు . పైగా దీనికి మ్యాచ్ అయ్యే చీర కూడాలేదు నాకు . నేను చెప్పిన డిజైన్ వున్నా జాకెట్లు ఇప్పుడు మీ అమ్మమ్మలు కూడా వేసుకోబు . ఫాషన్ అంతా మారి పోయింది . ఆ టైలర్ గాడికి ఇదంతా తెలిసే ఇన్నాళ్లు మన జాకెట్ ఆపాడు . వాడికి మీరంటే ఎంతో ప్రేమా అభిమానమును . నేను లేటెస్ట్ ఫాషను లో మీతో కలిసి తిరుగుతూ ఉంటే మిమ్మల్ని చూసి కన్నులకు పండుగ చేసుకోవాలని వాడి కోరిక .ఇహ ఈ సంక్రాంతి కి జాకెట్ మీదకి అని లేటెస్ట్ డిజైను లు వచ్చాయంట. వాడే చెప్పాడు . పొరుగింటి ఆమె ,మూడువేలిచ్చి, అప్పుడే ఒకటి కుట్టించుకుంది కూడానూ . ఎంత బావుందన్నారు ? ఒక పాతిక వేలు మనవి కావు అనుకుంటూ మనము రేపే రాజమహేంద్రవరం వెళ్ళుదాము . చీరలు జాకెట్లు అక్కడ చవుకటా .. వన్ ప్లస్ టెన్ ఆఫర్ లు కూడా ఉంటాయట .చీరకు ఇరవై , జాకెట్ ముక్కకి రొండు టైలర్ కి మూడు వేలు - మొత్తం పాతిక వేలు-

అంతే  - అంతకు మించి పైసా ఖర్చు పెట్టించను. నేను ఎంత ఆమాయకురాలినైనా - మీరు ఎంత కష్టపడి ఘడించుకు వస్తున్నదీ నాకు తెలియదా  ? ఇదంతా మీకోసమనే కదా  " అన్నది గడుసు బుచ్చి .

" ఇలాంటి స్త్రీని ఎక్కడా కానము అనుకున్నాను.  కానీ ఇదేమిటి భాయి ఈమె ముందు నా రస్సా పారలేదు ? కొంపతీసి ఈమె సాధారణ గృహిణి అయ్యిందా ఏమీ ? " అని అలోచించి " ఏమోయి వెంకటేశం నా ప్రియం బావుమరిదీ .. ఒక్క సారి ఇలా రమ్మీ - ఒక సాధారణ గృహిణి గురించి ఒక గంటపాటు నీకు ఏక  బిగిని ఒక అసాధారణమైన  లెక్చర్ ఇస్తాను . దీంతో నీవు పెళ్ళీ పెటాకులు మానివేసి - శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ  పరమహంస పరివ్రాజికశ్రీ  వారణాసి శ్రీ రామ కృష్ణ వాలే  నిత్యా సంతోషివిగా బ్రతుకు దువు గానీ  ." అన్నాడు

# మా తిక్కల తాత సిద్ధాంతము

## 29-01-24

మా పెద్దల వత్తిడి మూలకంగా  "తాతగారూ"  - అని మన్నించి మాట్లాడించ వలసిన వారొకరున్నారు . అయన ,తిక్కల వేషం లో ఉంటాడు. తిక్క తిక్కగా చూస్తాడు - తిక్క తిక్కగా మాట్లాడుతాడు . అందు వల్ల మేము ఆయన్ను ఆట పట్టించటానికి కాక,  మాట్లాడించటానికి గాను ప్రత్యేకించి - పలకరించము .

మా వంశస్థులెవరో కాలం చేశారు . నేను వెళ్లేసరికి ఆయన అక్కడే వున్నాడు . కాలం చేసిన వారికి ఈయన తమ్ముడు .

"వెళ్ళు వెళ్లి తాతగారిని కాస్త పలకరించి రా" అని మా పెద్దలు చేసిన వత్తిడి మూలకంగావచ్చిన నేను - ఒక పక్క మౌనంగాకూచున్న అయన వద్దకు వెళ్లి " ఏమండీ తాతగారు బాగున్నారా ?" అని పలకరించాను . ఆయన తిక్కల మనిషి కాబట్టి ఏమి వినాల్సి వస్తుందో ఏమో ? ఎంత సేపు వినాల్సి వస్తుంది ఏమో ? అని భయ పడుతూ - చాలా మంది ఆయనకు అందుబాటులో లేకుండా ఎడంగా కూచున్నారు

" ఆయన యెట్లా పోయాడో నీకు తెలుసుటరా? " అని ఆయన నన్ను అడిగాడు

" హార్ట్ అట్టాక్ అన్నారు "

అది కాదు అసలు విషయం వేరే వుంది - రాసుకో " అంటూ అయన తన చేతి సంచీ లోనుండి ఒక పెన్ను పేపర్ తీసి నా చేతుల్లో పెట్టాడు " ఇదేకదా తిక్కల తనం అంటేనూ .

" ఈ చావు వెనక ఏమి మిస్టరీ ఉందొ ఏమో ? అని నాకు ఆసక్తి కలిగింది .

" వూ రాసుకో - మొదటిది ఏమిటంటే - తాపీ మేస్త్రి మన డబ్బు తీసుకొని మనకు ఇల్లు కట్టి పెట్టి - ఇహ మీరు గృహ ప్రేవేశం అవ్వండి " అని చెప్పినట్లు -దేముడు మన పుణ్యాన్ని తీసుకొని మనకోసం అని స్వర్గంలో ఒకఇల్లు కట్టి " రండి దయచేసి గృహప్రవేశం చేయండి " అంటాడు .అట్లా కొందరు పోతారు . " పాపీ చిరాయువు " అన్న మాటే దీనికి రుజువు "

ఇహనూ రొండోది ఏమిటంటే " నువ్వు తమ వర్కర్ వి గానీ, ఉద్యోగివి గాని అయితే - నువ్వు వారి సేవలో వున్నందుకు గానూ - నీ

యాజమాన్యం వారు   నీకు   ఒక క్వార్టర్ ఎలాట్ చేస్తారు  . అట్లాగే  -  నీ పనేదో నువ్వు చేసుకుంటూ పోతే -  నువ్వు పుణ్యం చేసినా చేయక పోయినా- ఎదో ఒక  పని చేసుకుంటూ పోయినందుకు గానూ  నీకోసం స్వర్గం లో వున్న ఓ   క్వార్టర్  కేటాయింపు అవుతుంది  - అట్లా కూడా కొందరు పోతారు. ఇదే కర్మయోగం అంటేనూ "

ఇహ మూడు " అటూ ఇటూ కానీ సామాన్య  ఓటర్లు వుంటారు .  ప్రభుత్వం వారు జనతా కాలనీలు కట్టి సామాన్య జనానికి అల్లొట్మెంట్ ఇచ్చి జనంలో మంచి పేరు పేరుపొంది  అధికారానికి వస్నె తెచ్చుకోవాలని కోరుకున్నట్లు  - తన పేరుకు కూడా వస్నె తెచ్చుకోవాలని  దేమునికి ఉంటుంది . అందువల్ల -- స్వర్గంలో జనతా కాలనీ లాంటివి పూర్తి అయినపుడు దానిలోకొందరికి అల్లొట్మెంట్  ఇస్తాడు . అట్లా కూడా కొందరు పోతారు  .  నేను కూడా అట్లా పోతాను  "

నాలుగు --" ఏదైనా ఒక పుణ్య క్షేత్రంలో - అన్ని వసతులూ ఏర్పరుస్తారు . అక్కడికి భక్తులు కాని వారు రాకూడదని - అసౌకర్యాలు అనుభవించకూడదు అని రూలేమీ ఉండదు . ఎవరైనా అనుభవించవచ్చు . పుణ్యం చేసిన వాడైనా కానీ , పాపం చేసిన వాడైనా  కానీ  నరకానికి పోదాము అనుకుంటూ  పోడు . స్వర్గానికి పోదము అనుకుంటూనే పోతాడు . దేవాలయ ప్రాంగణంలోని సౌకర్యాలు ఆస్తికులు నాస్తికులకు సమము అయినట్లు - దేముని స్వర్గము వాళ్ళతో పాటు మనకోసము కూడా నమ్మినవాళ్లు వుంటారు . అట్లా కూడా కొందరు పోతారు . "

ఐదు -" పంచ భూతాల మీద ప్రేమ లో పడేవారు వారు కొందరుంటారు .ఆప్రేమలో పడి కూడా కూడా కొందరు పోతారు "

" మా అన్నయ్య అనగా మీ పెద్ద తాతగారు ఈ ఐదింటిలో దేనిలో ఒక దాని వల్ల పోయినాడు . హార్ట్ ఎటాక్ వల్ల కాదు - అని రాయి . చదివిన వాళ్ళు చర్చించి అయన ఎట్లా పోయింది నిర్ణయం చేస్తారు . ఎవరికైనా ఎందుకైనా పనికొస్తుంది "

పై చావుని చూసి వైరాగ్యములో పడిన మా తిక్కల తాత తనను తాను ఓదార్చుకుంటూ పై రకమైన తిక్కల స్టేట్మెంటు ఇచ్చాడని నేను నమ్ముతాను .

తిక్కల స్టేట్మెంటు అయితే ఏమైపోయింది కానీ ? మా తిక్కల తాత సర్వజనులకూ ఓదార్పు నిచ్చే స్టేట్మెంటు నిచ్చాడని - అనుకోవచ్చు.

వారణాసి శ్రీ రామ కృష్ణ రచన

## శుభ శకునం

రామ బ్రహ్మం గారు మా బాబాయి . నేను వారిఅబ్బాయి. అబ్బాయికి బాబాయికి పెద్ద వయసు తేడాలేకుండా వుండటము - ఇద్దరూ స్నేహితుల వాలే మెలగటమూ మీరు అనేక సార్లు చూసి వుంటారు .

నాకూ మా బాబాయికి వయసు తేడా తక్కువ . నేను చేసే అన్ని పనుల్లోనూ ఆయనను కలుపుకుంటూ వుంటాను .నేను ఎక్కడికి వెళ్లినా గానీ ఆయన్ను పిలుచుకు వెళ్ళటం - నాకు అలవాటు . కాకపోతే ఆయనే చప్పున ఇంటిలోనుండి బయట పడడు .

" శుభశకునం కనపడనివ్వు బయలు దేరుదాము " అని ముందు గా ఓ మాట అంటాడు . ఆ శుభ శకునం ఏమిటి ? అది కనపడుతుందా లేదా ఈ యన నాతో కల్సి బయలు దేరతాడా లేదా ? అన్నది నాకు సస్పెన్సు గా ఉండేది .

" శుభ శకునం అయ్యింది - పట్టారా బయలు దేరదాము" అని అయన అన్నాడు .

" నీళ్ల బిందెతో ఎదురూ ఎదురు రాలేదు . శుభ శకునం ఏమిటో? నాకేమీ కనపడలేదు"

" మీ పిన్ని శుభశకునం చూపించిందిరా . నువ్వు గమనించలేదు . గమనించటం పద్ధతి కాదనుకుని ఉంటావు .మీ పిన్ని పవిట చాటునుండి పుస్తెలు తీసి కళ్ళకు అద్దు కున్నది . అదేనా పాలిట శుభశకునము .ఆమె పుస్తెలను కళ్ళకు అద్దుకున్నది అంటే ఈ సమయాన - నేను నీతో కలసి బయటకు వెళ్ళటం ఆమెకు ఇష్టమే నని దానికి అర్ధము . ఈ శుభ శకునం కనపడ్డప్పుడు - మనం ఏవేళ్లకుఇంటికి చేరినా తలుపు తీస్తానని - అన్నం పెడతానని అర్ధము . అంతేకాక ఈరోజును నాకు వదిలి వేసిందని - ఈ రోజు నాతో అంట్లు తోమించదు అని - బట్టలు ఉతికించదు అని కూడా అర్ధము. అన్నింటికి మించినది ఏమిటంటే ఓపిక వున్నా లేకపోయినా రాత్రికి కావాల్సిన ఇడ్లీ పిండి దోసెపిండి ని - గ్రైండర్ లో వేసి నేనే రుబ్బుకుంటాను - ఇడ్లీ వాయలు కూడా నేనే వేస్తాను మీరు కేవల మాత్రంగా తింటే చాలును అని అర్ధము . ఒక్కొక్క సారి

కుక్కరు నేనే పెట్టుకొని - నేనే కూరలు తొడుక్కుని - వేపుడు ముక్కలు చేస్తాను అని అర్ధము కూడా ఉంటుంది

శుభశకునమునములు అనేకం ఉన్నట్లు మీ పిన్ని చూపించే శుభశకునానికి సమయాన్ని బట్టి రకరకాల అర్ధాలు ఉంటవి - ఇవాళ్టి  శుభశకునం అర్ధం ఏమిటంటే  ? రాత్రి నడుము నొప్పి అని పడుకుంది . ఇప్పుడు బాగానే వున్నది . మీరు అరగంటపాటునాకు అమృతాంజనం మర్దనా చేయవల్సిన  అవసరం లేదు బిళ్ళలతో తగ్గింది ." అని అర్ధము .

" పిన్నమ్మ గాజులు గలగలా లాడిస్తూ వున్నదేమీ - అది కూడా ఎమన్నా శుభ శకునామా?

" అవును- మనం మన ఇష్టమొచ్చిన హోటల్ లో టిఫిన్ చేసి తనకు కూడా పట్టుకు వచ్చి ఇచ్చి - ఆపై  మధ్యాన్నాము కూడా మన ఇష్టము వచ్చిన చోట లంచ్ చేసి తనకు పార్సెల్ పట్టుకు రమ్మని ఆ శకునానికి అర్ధము . ఇది శుభ శకునము కిందకే వస్తాది . మనం కోరింది తినచ్చు - మనం ఎక్కడ తిరిగినా కానీ మీ పిన్నికి - టీ కాఫీ టిఫీన్ భోజనం అన్నీ   పార్సెల్ తెచ్చి ఇస్తే ఆ రోజున  ఇక మన దోషాలు ఏవీ గమనింపబడవు  "

## నా రామలింగడి కథ 31-1-24

అహంకారము నెత్తి కెక్కిన పండితుడు ఒకడు రాజు గారి ఆస్థానినికి వచ్చాడు . వాడికి శృంగ భంగము కావాల్సిన రోజులొచ్చి అట్లా వచ్చాడు అనుకోవాలి

" రాజా .. నేను ఏ ప్రశ్నకైనా సమాధానము చెపుతాను - అది సరి ఐన సమాధానము అని మీరు ఒప్పుకుంటే - అప్పుడు నేను మీ కాళ్ళు కడిగి ఆ నీళ్లు నా నెత్తిన చల్లుకునే వరం ఇవ్వాలి . మీరు గానీ , మీ పండితోత్తములు మరెవరైనా గానీ అడిగిన ఏ ప్రశ్నకు అయినా నేను సరి ఐన సమాధానము చెపుతాను . చెప్పలేకపోతే నా కాళ్ళు నరికించుకుంటాను " అని సవాల్ చేసాడు .

సొంత కాళ్ళు నరికించుకొంటాను అని సవాలు చేసేవాడికి ఎంతో ఎంతో గొప్ప పాండిత్యం ఉండక పోదు . " కాళ్ళు కడిగి నీళ్లు నెత్తిన చల్లుకోవడం అనే వరం ఇమ్మంటున్నాడు - అంటే రాజు గారి కాళ్ళు కడిగి ఆయనకీ తన పిల్లనిచ్చిపెళ్లి చేసి రాజుగారికి మామగారు అయ్యే ఉద్దేశ్యంతో ఈ పండితుడు వచ్చాడా ఏమి? ఇంత ఆశతో వచ్చాడంటే వీడు గండర గండ - ఉద్దండ పిండ పండితుడు అయ్యి ఉంటాడు - అని సభికులు చర్చల్లో పడ్డారు .దీనితో పందెము రసకందాయంలో పడింది .

ఇట్లాంటి వాటికి రామలింగడు ఎట్లాగో వున్నాడు కదా ? అన్న ధైర్యముతో రాయలు గారు సరేను అన్నాడు . పందెము మొదలయింది .

" కొద్ది రోజులుగా మా రాణిగారు చింతాక్రాంతులై వుంటున్నారు . ఏమి కారణం ?' అని రాజు గారు ప్రశ్నించాడు .రాజుగారు ఎంత ఆలోచించినా సమాధానము దొరకని ప్రశ్న ఇదే కాబట్టి అదే అడిగారు .

పండితుడు కాసేపు కనులు మూసి గతంలోకి తొంగి చూసి " రాజా కొన్నాళ్ల క్రితం మీరు మీ భార్యా సమేతంగా - ఒక యువ సేనానికి జరిగిన వివాహానికి

వెళ్లారు . అప్పుడు మీరు ఆ సేనానిని భుజం తట్టి అభినందించారు . ఈ అభినందన చూసిన రాణి గారు " నీకు భలే అందగత్తె దొరికిందయ్యా ?అని మీరు అతన్ని అభినందించారు అనుకొన్నది . అట్లాగా అనుకోని , " ఆ పిల్ల ఎంత సంబర పడిందో ఏమో ? నన్ను చూసి మా అయన భుజం తట్టి నన్ను అభినందించే రోజు - అది చూసి నేను సంతోష పడే రోజు - సంబర పడే రోజు ఈ జన్మకు నాకు రాదు కదా ? అని రాణిగారు చింతాక్రాంతులు అయినారు అని చెప్పాడు .

పండితుడు ఇంగిత జ్ఞ్యానం వున్నవాడు కాబట్టి విషయం అంతా రాజుగారి చెవిలోని చెప్పాడు కానీ సభలో కాదు ..ఇప్పటి వరకూ - రాణీ గారి చింతను మాన్పటానికి రాజుగారు ఆమెకు అనేక బహుమానాలు సమర్పిస్తూ వున్నాడు . అసలు కారణం తెలిసింది కాబట్టి ఇహ బహుమానాలు తెచ్చి ఇచ్చే దాని గురించి ఆలోచించనక్కరలేదు - అది చాలు " అని రాజుగారు మనస్సులో తేలిక పడ్డారు . అదే మనస్సుతో , తనకు సరిఅయిన సమాధానము దొరికింది అన్నట్లు రాజుగారు తల ఊపాడు .

" ఇక నన్ను ప్రశ్న అడగండి" అన్నాడు పండితుడు .ఇక తనకు గెలుపు తప్పదు అన్న ధీమా కనబరుస్తూ . సభ మొదలు కాగానే రామలింగడికి కబురు వెళ్లగా అతడు తగిన సరంజామాతో వచ్చే వున్నాడు .

రామలింగడు లేచి వినయంగా లేచి రాజు దగ్గరికి వెళ్లి - తన చేతి సంచీలోనుండి ఒక మేదరి వెదురు బుట్ట ను రాజుగారి తల మీద బోర్లించాడు .

" ఇప్పుడు చెప్పండి - మా రాజుగారు ఏ రంధ్రాలనుండి గాలి పీలుస్తున్నారు ? అని రామలింగడు ప్రశ్నించాడు .

పండితుడు ఆలోచనలో పడ్డాడు . వెదురు బుట్టకు అన్నీ రంధ్రాలే వుంటవికదా ? అవి వందలకు పైగా ఉంటవి . ఏ రంధ్రము అని చెప్పేట్లు ? దాని దిక్కును నిర్ణయించేది ఎట్లు ? అదీగాక బోర్లించిన బుట్ట కిందభాగము నుండీ కూడా రాజు గారు ఎక్కువ గా గాలి పీలుస్తూ ఉండవచ్చు . బుట్ట కింద భాగాన్ని "అడుగుభాగము " అంటారు . మరి పై భాగాన్ని ఏమంటారు? ఆ మాట ఏమిటో తెలిస్తే నేను గెలిచినట్లే " అనుకున్నాడు .

అనుకోని- మనస్సులోనే అనేక భాషలలోని అనేక మాటలను మనస్సులోనే నెమరు వేసుకున్నాడు .ఎక్కడా ఏ పదమూ కనపడలేదు - కానీ రెండు గంటల టైము మాత్రము గడిచి పోయింది . రాజుగారు నెత్తి మీద వున్నా బుట్టతో విడ్డూరంగా వున్నాడు . ప్రజలు తన వంక విదూరం గా చూస్తూ ఉండి ఉంటారన్న ఆలోచన రాజుకు కంపరంగా వుంది . రాజులకు తరచూ మీసం మెలివేయటం అలవాటు కాదా ? మీసం మెలివేయటానికి బుట్ట అడ్డు తగులుతున్నందుకు కూడా రాజుగారు అసహనంగా వున్నారు . ఆ అసహనంతో మాటి మాటికీ తన కత్తిని ఒరలోనుండి లాగే ప్రయత్నాన్ని చేస్తూ ఆపై దాన్ని బలవంతాన ఆపుకుంటున్నాడు .

" . ఇది ఎదో చివరికి న ప్రాణాల మీదకి వచ్చేట్లు వుంది " అని పండితుడుఆందోళనలో పడ్డాడు .

"దీనికి ఎవరు సమాధానము చేప్పినా నా ఓటమిని ఒప్పుకుంటాను . " అని ప్రకటించాడు .ప్రాణాలు పోకుండా కాళ్ళు పోయినా మంచిదే అనుకుంటూ .

" రామలింగా నేను ఏ రంధ్రము కుండా గాలిపీలుస్తున్నదీ నాకే తెలీకుండా వుంది . ఇహ నువ్వు సరిఐన సమాధానము చెప్పి నా శిరస్సును - నన్ను బుట్టలోనుండీ తప్పించు " అని రాజు గారు ఆజ్ఞ్యాపించాడు .

" చిత్తం రాజా -- మీరు మీ ముక్కు రంధ్రాల ద్వారా గాలిని పీలుస్తున్నారు . మరి పండితుల వారు ఏమంటారో ?

అహంకార పండితుల వారు తల వంచుకొన్నారు .తన కాళ్ళను చివరిసారిగా కనులారా చూసుకున్నాడు .

నీతి - "మన అహంకారము మన ఆందోళన మనకు సరిఅయిన సమాధానము దొరకనివ్వవు " .

# అమెరికా అప్పుల గురించి రష్యా వారు 07-02-24

{టెక్నికల్ కాదు సాధారణ ప్రజలకోసం )

పై విషయం గురించి **06 -02 -24** న రష్యా ఒక వార్తా కధనం ప్రసారం చేసింది . అమెరికా అప్పులు చేసి మరీ యుద్ధాలు నడిపిస్తున్నది అని - చరిత్రలోని అనేకమంది యుద్ధము మీద పిచ్చతో యుద్ధము చేస్తూనే చచ్చి పోయినట్లు - అ అమెరికా కూడా ఈ యుద్దాల మీద పిచ్చతో యుద్దాలు చేస్తూ చేస్తూ నే కుప్పకూలి పోతుందని రష్యా అన్నది . తన కథనానికి సాక్ష్యంగా అమెరికన్ డెబిట్ క్లోక్ ని పేర్కొన్నది . అందువల్ల మనము ఈ క్లోక్ గురించి నేడు తెలుసుకుందాము .

అమరికా ప్రభుత్వమూ అధీనములో అమెరికా డెబిట్ క్లోక్ వుంది . మీరు ఇంటర్నెట్లో చూడవచ్చు ఈరోజున నేను చూసినపుడు అమెరికా డెబిట్ క్లోక్ - అమెరికాకి **34209498456635** డాలర్ల అప్పు ఉందని చూపింది . అంటే **34** ట్రిలియన్ డాలర్ ల అప్పు **.1 trillion -** అంటే ఒకటి తరువాత **12** సున్నాలు

యుక్రేన్ - రష్యా యుద్ధము జరుగుతూ వున్నది కదా ? యుక్రేన్కి-- అమెరికా ఆయుధ సహాయము చేస్తూ వున్నది . సహాయము కింద ఇచ్చినా - గానీ అమెరికాకి డబ్బు ఖర్చు తప్పదు కదా ? మరి అమెరికా తన ప్రజలనుండి వచ్చిన పన్నులలోనుండే ఈ సాయం కోసం ఖర్చు చేస్తున్నదా ?? ఈ సాయానికి అవసాయమైన ఖర్చును కూడా -- పన్నుల రూపం లో చెల్లించటానికి ప్రజలు ఇష్టపడుతున్నారా? అమెరికా అనేక యుద్ధాలు చేస్తూ - యుద్దాలకు సాయం అందిస్తూ ఉంటుంది . మరి ప్రతి సారీ ప్రజలనుండి వచ్చిన పన్నులే ఖర్చు పెడుతున్నారా ?

లేదు . లేదు. యుద్దాలు లేదా యుద్ధాసాయాల గురించి తమ మీద పడుతున్న ఖర్చును- ప్రజల మీద పన్నులు వేసి రాబట్టటానికి బదులు - రాబడితే ప్రజలు తిరగ బడతారేమో అన్న సంకోచముతో - ఆ ఖర్చుకు అవసరమైన డబ్బు ను అమెరికా తన ఫెడరల్ రిజర్వు నుండి - అప్పు తీసుకుంటూ వుంది .

డాల్లర్ అనేది ప్రపంచ కరెన్సీ కాకముందు అంటే **1920** వరకూ **United Kingdom** వారి **pound sterling** ప్రపంచ కరెన్సీగా ఉండేది . ప్రపంచ దేశాలు తమ భవిష్యత్ అవసరాల కోసం - ఇజిలాండ్లో - పౌండ్ రూపంలో డబ్బు దాచుకునేవి . ఆరోజుల్లో అనేక దేశాలకు భవిషత్ అవసరాలు ఏమిటి అంటే - రైలు ఇంజినులు, ఓడ ఇంజిన్లు - ఫ్యాక్టరీలకు మిల్లులకు కావాల్సిన యంత్ర సామగ్రి వంటివి కొనుక్కోవటం . ఇంగ్లాన్డ్ ఈ మెషినరీ తాయారు చేస్తూ వుంది కాబట్టి అన్ని దేశాల వారు పౌండ్ రూపంలో డబ్బు దాచుకునే వారు . వరల్డ్ వార్ ఒకటి మరియు రొండు లో అనేక దేశాలు దెబ్బతిని - తమ దేశాన్ని పునర్ నిర్మించుకోవటానికి గాను తాము ఇంగ్లండ్లో దాచుకున్న మూల నిధిని వెనక్కు తీసుకోవాలి

అనుకున్నాయి . అంటే ఇంగ్లాండ్లో తాము దాచుకున్న డబ్బుకు బదులు - ఇంగ్లాండ్ నుండీ యంత్ర సామగ్రి పొందాలి అనుకున్నాయి . కానీ వరల్డ్ వార్ ఒకటి రెండు లో పాల్గొన్నాక ఇంగ్లాండ్ కూడా దెబ్బతిన్నది .దివాళా తీసి నట్లు వున్నది. తన దెగ్గర డబ్బులు దాచుకున్న వారికి తిరిగి డబ్బు చెల్లించటం లో-- అనగా యంత్ర సామాగ్రిని అందించటం లో విఫలం అయ్యింది . ఇటువంటి పరిస్థితుల్లోనే ఇంగ్లాన్డ్ భారత్ కి స్వాతంత్రం ఇచ్చింది అనే ఒక వాదము వుంది .

ఏది ఎట్లా వున్నా -- యుద్ధాలలో పాల్గొని దెబ్బతిన్న దేశాలకు తమ దేశాన్నీ పునర్నిర్మించుకోవటం తప్పదు కదా ? అందు కోసంయంత్ర సామాగ్రి లు ఎన్నో కావాలి కదా ? మరి ఇంగ్లాన్డ్ చేతులు ఎత్తేసింది కదా ? ఇక ఎవరు దిక్కు ?

అప్పుడు అమెరికా రంగ ప్రవేశం చేసి - తన దేశం లో తయారు ఐన వస్తువులను సేవలను - అప్పు మీదా అన్ని దేశాలకు అమ్మింది . అనగాప్రపంచ దేశాలలోఅనేకము అమెరికాకి డాలర్ల రూపంలో అప్పు పడ్డారు .ఈ డాలర్ల అప్పుతీర్చటానికి గానూవారు అమెరికాతో సరుకుల వాణిజ్యము చేసి తమ అప్పును చెల్ల కట్టారు .ఇట్లా అమెరికా వాణిజ్య కేంద్ర అయ్యింది . ఆతరువాత చిన్న చిన్న దేశాలు తమ మధ్య తామే సరుకు అమ్ముకున్నప్పుడు - తాము అమ్మిన సరుకుకు డాలర్లు కావాలని అడగటం మొదలైంది . ఇట్లా వచ్చిన డాలర్లతో కూడా అమెరికా ఇచ్చిన అప్పు తీరుతుంది కదా ? ఇదే కాక డాలర్లు కావాల్సిన చిన్న దేశాలు తమ సరుకుని అమెరికాలో అమ్మి డాలర్లు సంపాదించ వలసిన పరిస్థితి వచ్చింది . అప్పులు ఇచ్చే సిస్టం మొదలుపెట్టి అమెరికా తన డాలరును బలోపేతము చేసుకొని - స్టెర్లింగ్ పౌండ్( ఇంగ్లాండ్ } ను వెనక్కు నెట్టింది .

**1920** కి ముందుప్రపంచ దేశాలు - తమ సేవింగ్స్ ను ఎవుద్దేశ్యంతో పౌండ్లలో పెట్టు బడి పెట్టారో అదే అదే ఉద్దేశ్యముతో ఇప్పుడు డాలర్లలో పెట్టుబడి పెట్టటం ప్రారంభించారు .అంటే ఎప్పుడో అపుడు అమెరికానుండి యంత్ర సామాగ్రి- ఆయుధాలు తెచ్చుకుందాము అని.

.ఇట్లాగా వివిధ దేశాలు తమకు అత్యవసర పరిస్థితి వచ్చినపుడు పనికొస్తాయని అలోచించి - ఆమెరికన్ డాలర్లలో తమ దేశపు సొమ్ముని దాచుకుంటూ వచ్చాయి . ఎట్లా దాచుకుంటాయి? అంటే ఒక దేశము వచ్చి అమెరికాకి పెట్రోల్ అమ్మింది అనుకోండి .ఆ దేశము తన అమ్మకానికిగానూ ముట్టవలసిన సొమ్మును తీసుకోకుండా - మీరు మాకు ఇవ్వ వలసిన సొమ్ము మాకు బకాయి ఉన్న సొమ్ముగా మీ బ్యాంకు ఖాతాలలో రాసి వుంచండి అని కోరుతాయి . వీరు తమ సొమ్మును ఎట్లా వెనక్కు తీసుకుంటారు అని అడిగితే ? అమెరికా నుండి సేవలు - ఆయుధాలు - యంత్ర సామాగ్రిని తీసుకుంటారు .

.అమెరికా బ్యాంకింగ్ సిస్టం అంతా ఫెడరల్ రిజర్వు సిస్టం కింద పని చేస్తుంది. వివిధ దేశాలు అమెరికా వద్ద దాచుకున్న సొమ్ము అంతా ఈ సిస్టం కిందకు మళ్లుతుంది . ఎవరికో బకాయి తీర్చటానికి అని మనము పర్సులో పెట్టుకున్న సొమ్ములోనుండి కొంత తీసి ఎవరికో సాయం చేస్తే మనకు చివరికి ఏమి మిగులుతుంది ? చివరికి అప్పు మిగులుతుంది . ఈ రకంగా అమెరికా అప్పుల పాలు అయ్యింది . ఈ అప్పును ఎట్లా తీర్చాలని అమెరికా ఉద్దేశ్యం ? అంటే రెండు దేశాల మధ్య కయ్యాలు ప్రోత్సహించి ఇరు పక్షాలకు ఆయుధాలు అమ్మి - తాను అమ్మిన ఆయుధాల ధరను - తాను ఇవ్వవలిసిన డాలర్ల నుండీ తగ్గించటం.

చివరికి ఏమిటంటే  అమెరికా తన అప్పులు తగ్గించుకోవటానికి ఆయిదాలు అమ్ముతుంది . అమ్మటం కోసం అని తయారు చేస్తూ ఉంటుంది .  అంటే అమెరికాకి అప్పులు లేకపోతే యుద్ధాలు వుండవు అని .ఇదీ రష్యా టీవీ వారి అభి ప్రాయము .  యుక్రేన్ యుద్ధములో తనతో కలిసి రావాల్సిందిగా అమెరికా అనేక దేశాలకు ఆఫర్ ఇస్తూ ఉంటుంది .అంటే నేను  ఆయుధాలు సరఫరా చేసి దాని ధరను మీకు ఇవ్వవలసిన సొమ్ములోనుండి మినహాయించుకుంటాను అని చెప్పినట్లు .

అమెరికా యొక్క యుద్ధ దాహానికి కారణము - ప్రపంచ దేశాలన్నీ డాలర్ల వెంట పడటమే .

డాలర్లకు ప్రత్యాన్మాయంగా త్వరలో ఎదో ఒకటి వస్తుందని - అంటే అమెరికా ఇవ్వలేని సరుకులు ఆయుధాలు యంత్రాలు వంటివి ఇచ్చే ఇంకో దేశం తయారు అవుతుందని - { అది చైనా కావచ్చు రష్యా కావచ్చు } అప్పుడు అమెరికా  అప్పులు తీర్చలేక - అప్పుతీర్చటానికి ఆయుధాలు అమ్మలేకా - అమెరికా డాలర్ మరియు అమెరికా కుప్ప కూలి పోతుందని రష్యా జోస్యం .

నేడు అమెరికా వద్ద ఏదేశాలు ఎన్ని డాలర్లు దాచుకున్నాయో అది అంతా అమెరికా పాలిట అప్పు అయ్యింది . లిస్ట్ చూడండి . అమెరికా ఈ అప్పు ఏమి అమ్మిఎలా  తీరుస్తుంది ? ఆయుధాలు అమ్మేనా ? ఆయుధాలు అమ్మటం కోసం యుద్ధాలు ప్రోత్స హిస్తూ పోతుందా ? ఏమో ఎలా తీరుస్తుందో మనకెందుకు .

ఇండియా సొమ్ము మూడు ట్రిలియన్ డాలర్స్ మించి అమెరికాలో వుంది . అంటే మనకు కూడా అమెరికా అప్పువుంది . అందువల్ల మనకు కూడా ఆయుధాలు అమ్ముతుంది .

ఇది ఏ దేశాన్ని ఉద్దేశించి కాదు - ఎకానమీలో ఒక విభాగాన్ని గురించి మీకు అవగాహన ఇవ్వటమే నా ఉద్దేశ్యము . ముగింపు ఏమిటంటే - అమెరికా ప్రోత్సహించిన - సాయం చేసిన ఏ యుద్ధము అంత త్వరగా ముగియదు . నిజానికి ఉక్రేన్ మరియూ రష్యాల మధ్య యుద్ధము రోజులలో ముగిసి పోతుందని అందరూ అనుకున్నారు . కానీ ఇప్పుడది సంవత్సరం దాటింది .జనం ఏడుస్తూనే వున్నారు .

**Japan. $1,098.2. 14.52%-** ఈ పెర్సెంటేజ్ అమెరికన్ మొత్తము అప్పులో జపాను శాతము

**China. $769.6. 10.17%**

**United Kingdom. $693. 9.16%**

**Luxembourg. $345.4. 4.57%**

**Cayman Islands. $323.8. 4.28%**

సమాచార సేకరణ - విపులీకరణ - సమర్పణ - వారణాసి శ్రీ రామ కృష్ణ .

# పంతులుగారికి పట్టు బట్టలు - 08 -02 -24 {రెండో సారి}

మా వూరు అమరావతి . ఇది మా చిన్నప్పటి ముచ్చట . మావీధి బడి మాస్టారుగారు పేరు సొలాసా లక్ష్మీ నారాయణ గారు . అయన అప్పటికే ఎలిమెంటరీ స్కూల్ మాస్టార్ గిరీ చేసి విరమించి, వీధి పాఠ శాల నడుపుతూ

-- చన్నీళ్లకు వెన్నీళ్ళు కలుపుకుంటూ వున్నాడు .అప్పటిలో ఐదో తరగతి పిల్లలకి నెలకి అయిదు రూపాయల ఫీజు .

మా పంతులుగారు పిల్లల కు కొన్ని తెలుగు పదాలు చెప్పి వారిచేత పలకల మీద రాయిస్తూ వున్నాడు .

"మనము ప్రతిరోజూ పప్పు తినాలంటే కందిపప్పు అవసరపడతవి . మీలోని ఆడపిల్లలు రేపు పెళ్లిళ్లు అయినాక వారి మొగుళ్ళకు కందిపప్పు- రొండు శేర్లు కావాలె "అని చీటీ రాసి ఇవ్వాల్సి వస్తుంది . అందువల్ల " కందిపప్పు రెండు శేర్లు " అనే మాటని మీ పలకల మీద రాసి చూపండి " అన్నాడు -- ఒక పక్కాగా కూచున్న ఆడపిల్లలను చూసి .

అందులో ధనలక్ష్మి అనే అమ్మాయి వుంది .ఆ అమ్మాయి గత ఐదేళ్లుగా ఇక్కడే చదువుతుండటం వల్ల - ఆ అమ్మాయి - మా బడిలో నే టాప్ క్లాస్ అయినా ఐదో తరగతిలో కి వచ్చింది . ఆ అమ్మాయి " కందు పప్పు రెండు చేరులు " అని రాసింది . మా పంతులు గారు అది చూసి వళ్ళు మరిచి ఆ అమ్మాయిని దండించి వదిలాడు . ఇది కాక " కందిపప్పు రెండు శేర్లు " అనేమాటను పలకమీద యాభై సార్లు రాసుకురమ్మని పనిష్మెంట్ కూడా ఇచ్చాడు . ఇంత పెద్దతరగతిలో ఉన్న తనకు - చిన్న తరగతి పిల్లల ముందు ఎంతో అవమానం జరిగిందని ఆ ధనలక్ష్మి మనస్తాపంచెంది - బడి వదలగానే - ఏడ్పు ముఖంతో ఇంటికి పోయింది .

ధన లక్ష్మి తండ్రి వూర్లో కెల్లా పెద్దదైన పచారీకొట్టుకు యజమాని . పైగా బ్రతక లేని బడి పంతుళ్ళ పాలిటి కల్పవృక్షం . అడిగినదే చాలు పంతులుగార్లకి అరువు మీద సరుకులు కడతాడు . మా పంతులు గారు కూడా ఈయన పద్దులో ఉన్నవాడే . ఆ సాయంత్రం పంతులుగారు సంచీ పుచ్చుకొని శెట్టి గారి కొట్టుకు వెళ్లి " రేపు మా బావమరిది రానున్నాడు

.పప్పు లేని భోజనం మా ఇళ్లల్లో మర్యాద గాదు " ఖాతాలో రాసుకొని ఒక సేరు కందిపప్పు ఇవ్వండి " అని అడిగాడు . పంతులుగారికి ఇప్పటికే కొట్లో పెద్ద అప్పు వుంది . ఇంకా అప్పు పుడుతుందో పుట్టదో అని అనుమానం వుంది . ఇదికాక శెట్టిగారు ధనలక్ష్మి జీతం కోసమని ప్రతినెలా ఐదు రూపాయలు అప్పులోనుండి తగ్గిస్తూ ఉంటాడు .

శెట్టిగారు కందిపప్పు కొలిచి పట్టుకొని " ఏందీ పంతులుగారు ? . మా అమ్మాయిని తిట్టి కొట్టారుటనే . శుక్రవారం సాయంత్రం పూట మాయింటి మా లక్ష్మి ఏడ్చుకుంటా యింటికి వస్తే మాకు ఎంత నష్టమో ఆలోచించండి? మా పిల్ల చదువుల సరస్వతి . బాల మేధావి . పిల్ల రాసినదాంట్లో తప్పేమి వున్నదీ అండీ ? . కందులు అనేవాటినుండి వచ్చే పప్పు కాబట్టి "కందు పప్పు" అని రాసింది .అదేమన్నా తప్పా? ఎవరన్నా సరే దుకాణం వెళ్లి " సింత పండు " ఇవ్వండి అని అడిగితే "చింతపండే " ఇస్తారు . అట్లాగే " ఎవరన్నా " రొండు శేరులు బదులు " రొండు చేరులు" అని చీటీ రాసుకొచ్చినా మేము రొండుసేర్ల కందిపప్పు నే ఇస్తాము . బేరం పోగొట్టుకుంటామా ? మీకామాత్రం తెలియక పోగా .. పిల్లని కొడితిరి . అది ఏడుస్తా కూచుంది .మీరు వెళ్లి " నీ తప్పేమీ లేదమ్మా . నేనే పొరపడ్డాను " అని బుజ్జగించుకు రండి . మా పిల్ల నవ్వితేనే మీకు " కందు పప్పు ఇచ్చేది " అని చెప్పాడు .

మా పంతులు గారుఇంటిలోనికి వెళ్లి ఆపిల్లను చంకన ఎత్తుకొని తెచ్చి " బంగ్గారు తల్లీ .. బాల మేధావీ నీ తప్పేమీ లేదమ్మా కందుల్లోనుంచి వచ్చే పప్పు "కందు పప్పే " అవుతుంది. నేనే పొరపడ్డాను " అని చెప్పి ఆపిల్లను బుజ్జగించాడు . ఆపిల్ల మేధావి కనుక పంతులుగారి కందిపప్పు బాధలు

అన్నీని అంతా అర్ధం చేసుకుంది . పిల్ల నవ్వులవల్ల పంతులుగారికి "కందు పప్పు' సంచిలో పడ్డవి.

ఇంతటితో ఆగలేను . మన దుకాణదారు వూరిలోకెల్లా శ్రీమంతు . వూరిలో జరిగే గుడి ఉత్సవాలలో పెట్టే హరి కధలకు బుర్ర కధలకు ఆయనే ఆర్ధిక దాత . ఒకేసారి హరి కధా గానం జరిగే టప్పుడు పంతులుగారిని వక్తగా పిలిచారు . పంతులు గారికి ముందే కొన్ని సూచనలు అందాయి . దానిప్రకారం మా పంతులు గారు హరికథ గానం చేసే ఆయన గురించి సభకి పరిచయం చేసి , ఆ తరువాత " మన వెంకట శెట్టిగారి కూతురు ధన లక్ష్మి .బాల మేధావి . ఆమె తెలివి నాకే అబ్బురం కలిగించినది . ఆమెకు చదవను , రాయను మీద ఎంతో మంచి పట్టు వున్నది .నిజం చెప్పవలనంటే. కొన్ని మాటలు నేను ఆమెనుండే నేర్చుకున్నానని చెప్పవలసి వుండే . మీరంతా అంటే మనమంతా ఇది గమనించాలె. ఇప్పుడు ఆమెచే ఒక ప్రార్ధ్నా శ్లోకం " అని ప్రకటించాడు . మా మాస్టారు గారు స్వామి భక్తి కొద్దీ, లేదా అప్పు భయం కొద్దీ చెప్పమన్న దానికన్నా ఎక్కువే చెప్పివున్నాడు అనుకోవాలె . ఇట్లాగా అయన అనేక సందర్భాలలో చెప్పవలిసి వచ్చినది . చేసినాడు కూడాను .

అనేక సభలో మా మాస్టారు చెప్పగా చెప్పగా - ఆమె వేదికలెక్కి ప్రార్ధనా శ్లోకాలు చదివి చదివి - చివరికి ఐదో తరగతి ని గొప్ప గా చదువుకున్న పిల్లగా ధనలక్షిపేరు పొంది- వివాహ వయస్సు కు వచ్చి నిలిచింది.

పిల్కు డబ్బు,తో పాటు గురువులు మెచ్చిన చదువు కూడా మస్తుగా వున్నదని పెద్ద పెద్ద సంభందాలు పరుగెత్తుకు వచ్చినవి .విదేశాలతో పొగాకు వ్యాపారం చేసే కోటీశ్వరుడు ఒకాయన వచ్చి ఈమీ నా కోడలు కావాల్సినదేనని పట్టు పట్టి జయించాడు .

ధనలక్ష్మి పెళ్ళిలో మా పంతులుగారికి పట్టు బట్టలు లభించినవి . ఏది ఏమైనా గానీ

మా పంతులుగారు " కంది పప్పు " అనటానికి ఇంకనూ జంకుతూనే ఉంటాడు అని నే అనుమాన పడతాను.

# ఎవరు పీకింది వారికి 8-02-24

మావూరు అమరావతి . దానికి దగ్గరలోనే వున్నది అనంతవరం . అక్కడ అనంతపురం ఎట్లాగో ఇక్కడ ఇది అట్లా .

సూర్యో దయం కాగానే అత్త - కోడలును తీసుకొని చేలోకి బయలు దేరింది .కోడలు నసుగుతూనే బయలు దేరింది . అత్తా కోడళ్ళు కూడి వేరు చనక్కాయ చేలోకి వెళ్లారు .

"నువ్వు అటునుండి పీక్కురా .. నేను ఇటునుండి పీక్కు వస్తాను " అన్నది అత్త .

ఫది ఎకరాలు ఒకే ముక్కగా ఉన్న ఆచెలో అత్త పడమర నుండి వేరు శెనక్కాయ చెట్లు పీకటం మొదలెట్టింది . కోడలికి తూర్పు దిక్కు వదిలింది . పడమరనుండీ మొదలెట్టిన ఆత్తకే కదా సూర్యుడు మొహాన తగిలి ఆమెను మాడుస్తాడు? కోడలి మీద ప్రేమతో నే అత్త -- తాను పడమర దిక్కు న దిగింది .కోడల్ని తూర్పు దిక్కున దిగమన్నది .

కోడలు అంటే ఎట్లా పనులు చేస్తుందో మీరు ఏనాడో తెలుసుకునే వుంటారు . ఈ కోడలు కూడా అట్లాగే పని చేసి - చివరికి మెరమెచ్చుగా " అత్తా.. అంతా నువ్వే

పీకేసి నావు - ఇంకా నాకేమి వుంది ? అంటూ ఓపంచ్ డైలాగ్ వేసింది- తన తెలివికి తానే మురిసి పోతూ . తాను పని చేయకుండా కూచోటానికి కారణం అత్త పనిచేసుకుంటూ పోవటమేనని - అత్త కారణంగా తనకేమి పని లేకుండా పోయిందని చెప్పటమే కోడలి మనో భావము

సాయంత్రంఊర్యుడు అస్తమిస్తున్న వేళ్ళ అత్త ఇట్లా అన్నది " ఎమన్నా గానీ పెద్ద కొడుకు భార్య వాయితివి- "ఇక మిగిలింది నువ్వు పీక్కో " అని

ఇంటికి వచ్చినాక ఇంటాయన ఇట్లా అడిగాడు " కోడలు ఎంత పీకింది ? నువ్వెంత పీకావు ?

"నేను ఎనిమిదెకరాలు కోడలు ఆర ఎకరా " అని అయన ఇల్లాలు అన్నది .కోడలు కాదు అంలేకపోయింది . నిజం అదే కాబట్టి .

" ఈ కోడలితో పీకులాట నువ్వు పడలేవు లే గానీ ఆ ఫది ఎకరాలలో

నువ్వు పీకింది నీకు - కోడలు పీకింది కోడలుకు - అని రిజిస్ట్రేషన్ వీలునామా రాస్తాను . రెండో కోడలు నువ్వు పొలం రమ్మంటే రాలేదు కాబట్టి మిగిలింది నాకు. ఎవరు పీకింది వారు అమ్ముకొని సొమ్ము చేసుకొని ఈ సంవత్సరం బంగారం కొనుక్కోండి " అన్నాడు ఇంటాయన .

ఎవరు పీకింది వారికి అంటే - ఎవరు కష్టపడితే వారే సుఖిస్తారు అని . ఈ కథలోని అత్తగారు తన పొలం ఆసరాగా కోడళ్లతో పీకులాట లేకుండా సుఖంగా కాలక్షేపం చేసింది .

వారణాసి శ్రీ రామ కృష్ణ అమరావతి సొంత కథ

# భూమి - రైతు - పశువులు - జనం - మీద ఓ ప్రేమ కథ 12-02-24

మా వూరు అమరావతి . దానికి దగ్గరిలో వుంది మల్లాది . నేను బాల్యంలో వున్నపుడు అక్కడ నే ఉండేవాడు న బాల్య మిత్రుడు వెంకట్రావు . అప్పుడు మేము ఎనిమిదో తరగతి . వాడు ఒక రోజు ఇట్లా అన్నాడు " మానాన్న నీ ఫ్రెండ్స్ ఎవరన్నా ఉంటే పిలుచుకురారా అంటున్నాడు - నువొస్తావా ? అని ఆప్యాయంగా అడిగాడు . నేను ఇంటిలో చెప్పి, స్కూల్ బాగ్ ఇంటిలో పడేసి మా వూరు అమరావతి నుండి వాడి వూరు మల్లాదికి వాడి సైకిల్ ఎక్కి , తొమ్మిది కిలోమీటర్లు తొక్కుకుంటూ వెళ్ళాము . వాడి నాన్న ఒక మోతుబరి రైతు . పేద రైతు లేదా పూర్ ఫార్మర్ కథలు చదవటమే కానీ రైతును చూడటం అదే మొదలు . అయన నన్నెంతో ఆప్యాయంగా పలకరించాడు , రొండు రోజులు వుండి వెళ్ళండి అని గౌరవించాడు .

మరునాడు అయన మాకు ఒక ఎడ్ల బండి ఇచ్చాడు . అవి ఏనుగులంత ఎడ్లు. వెంకట్రావు ఆ బండికి సారధి . నేను ప్రయాణికుడిని . ఈ ఎడ్లు మా పిల్లల మాట వింటాయా ?మనల్ని పడేసి పోతాయా ? అని నాకు భయం వేసి అదే అడిగాను .

" ఈ గొడ్లు మంచివి . మీరు బండెక్కండి. చక్కగా తీసుకెళ్లి మన జొన్న చేలో ఆగుతవి . చక్కగా మేసి ఇంటికి మరులతవి . నేనుకూడా వద్దును కానీ

మీకు పశువుల మీద సొంతంగా ప్రేమ కలగాలని నేను మీ వెంట రావటం లేదు . మీరు భయ పడవద్దు ." అని అని ఆ రైతు గారు చెప్పారు .

ఎడ్లు చక్కగానే దారి పట్టి వెళ్లి పొలం చూపించి- అవి మేత తిని మమ్మల్ని వెనక్కు తెచ్చినవి .నాకు నిజంగానే పశువుల మీద ప్రేమకలిగింది . ఇట్టి ప్రేమ ఓ ఎక్స్ **OX =** ఎద్దు అని చదివినపుడు రాదని మీకు తెలియకపోదు .

రొండో రోజు ఇదే ఎడ్లబండిలో ఆయన మేము కూడా పొలం వెళ్ళాము .రైతుగారు
పొలం లో ఒక మూలకు వెళ్లి అక్కడ వున్నా ఏవో కొన్ని పంటమొక్కలు **{** కంది అనుకుంటాను **}** పీకి ఆ జాగా నాకు చూపించి " బాబూ ఈ జాగా నీకే .నీ ఇష్టం వచ్చిన మొక్కలు తెచ్చి నాటుకో -" అన్నాడు .

నేను ఆ తరువాత టెస్టింగ్ కోసం అని వెళ్లి , అక్కడ ఒక వేప మొక్క ఒక మామిడి టెంకె నాటి వచ్చాను . మా అమ్మగారు ఇచ్చిన బెండ విత్తులు, చిక్కుడు విత్తులు నెలలో గుచ్చి వచ్చాను . రైతుగారే కొన్ని సొర, గుమ్మడి పుచ్చ విత్తులు ఇచ్చి "
బాబూ నాటండి -- మీరు మావాడితో పాటుగా వచ్చి - వీలున్నప్పుడల్లా మీ మొక్కలనుచూస్తూ ఉండొచ్చు . కాయలు కోసుకు పోవచ్చు . నీరు అదీ నేనే పెట్టి పెంచుతాను " అన్నాడు .
కాసిన కాయలు తెచ్చి కూర వండుకున్నాము . జానా కూడా జాగా లేని నాకు- ఆ రైతు చూపిన కొద్దీ జాగా వల్ల ఈ దేశపు భూమిపై అనంతమైన ప్రేమ -- మన రైతులపై అనంత మైన గౌరవము కలిగాయి .

మామిడి కాపుకువచ్చే దాకా నేను నా జాగా చుట్టూ తిరిగాను .
ఆనందించాను
వుద్యోగం వచ్చి ఆ ఆనందాన్ని వదిలి వేసాను . "ఇదిగో మీ చెట్టు మామిడి పళ్ళు అంటూ మీ వెంకట్రావు మాకు కొన్ని పళ్ళు తెచ్చి ఇచ్చాడు " అని మా తల్లి తండ్రులు ఎన్నో సార్లు సంబరం తో చెప్పారు . ఎందువల్లో ఆ సంబరం కూడా ఆగి పోయింది .

రిటైర్ అవ్వగానే మా వెంకట్రావు ని, ఆ జాగానీ ఆ మామిడి చెట్టుని గుర్తు చేసుకొని అక్కడికి వెళ్ళాను . పొలం పోయి రియల్ ఎస్టేట్ అయి ఉంటుంది అనుకున్నాను .
కానీ పొలం అట్లాగే వున్నది . నేను పెట్టిన మామిడి చెట్టు కూడానూ వున్నది. నా తరువాత నాలాగే ఎవరో పెట్టిన చెట్లు కనపడ్డాయి .అవి కొబ్బరి నిమ్మ జామ లాంటివి - రావి మర్రి లాంటివి కూడా .ఈ చెట్ల మధ్యలో " వెంకటరామ నిలయం " అని చాలా పెద్దబిల్డింగ్ ఉన్నది .అంతటి బిల్డింగ్ మీవూరిలో ఉంటే మీకు వీజీగా నెలకు లక్ష అద్దె వస్తుంది . వెంకటరావు ని కలిసి నన్ను పరిచయం చేసుకున్నాను . క్షణాలలో మేము తిరిగి బాల్య స్నేహితులం అయినాము . నా జాగా నాదేనని - ఆ మామిడి చెట్టు నాదేనని అతడు అన్నాడు . ఇద్దరం అక్కడ కూచున్నాము . అతడు ఇట్లా చెప్పాడు " నేను మా నాయన మాయలో పడి ఈ వూరు వదల లేక పోయాను .వ్యవసాయమే చేసి సంపాదించాను . చివరికి ఈ బిల్డింగ్ కట్టి ఉన్న ఆస్తులు బ్యాంకులోని డబ్బులు దీనికి రాసేసాను . ఇది అనాధాశ్రమం కాదు . నిత్యజీవితం మీద విసిగిన వారు , ఆనాధలు , అభాగ్యులు , ఒంటరి వారు ఒంటరిగా బ్రతకాలనుకున్న వారు ఇలా ఎవరైనా నా ఇక్కడికి రావచ్చు .ఎక్కడ ఖాళీగా ఉంటే అక్కడ నివాసం ఉండొచ్చు . దేనికీ నా పర్మిషన్

అవసరం లేదు . వంటశాలలో వంటవారిని పెట్టాను . సరుకులు పెట్టాను . ఇక్కడ నివాసం వున్న వాళ్ళు , వాళ్లకు కావాల్సిన వంట , వంట వాళ్ళను అడిగి వండిపించుకొని తినొచ్చు . కాలక్షేపం కోసం పొలంలో కూరలు పండిచ్చుకోవచ్చు .మానుకోవచ్చు . ఇష్టం తీరినాక వెళ్లి పోవచ్చు . ఎవరు వచ్చారో ఎవరు పోతున్నారో నేను అడగను .ఇది మా నాయన గారి ఆలోచనలకు మోడల్ . నేను దానిని అమలు పరుస్తూ ఆయన ప్రేమలో చిక్కుకు పోయాను " అన్నాడు వెంకట్రావు .

మీరో నేనో ఎందరో జనాన్ని చూస్తాము . కొందరి మీద రోత పడతాము కూడా .ఇక్కడ ఉన్నటువంటి జనాన్ని ఎక్కడ చూడమేమో అనిపించింది . ఈ ఫ్రీ వాతావరణంలో - ఒకరి కొకరు తెలియని వారు అన్న తమ్ముళ్ల మల్లె మాట్లాడుకుంటున్నారు . ఒకరికొకరు భరోసాగా వుంటున్నారు . ఇది చూసి నాలో నా తోటి జనం మీద ప్రేమ మొలిచింది . నా మామిడిటెంకె - భూమిని చీల్చుకొని ఎట్లా మొలిచిందో అట్లా మొలిచింది అనాలి . ఇక కాయలు కూడా కాయిస్తాను . కాయా కావలి అంటే నన్ను అడగండి .

# మా అమరావతి శివుడు కదా ..

**14-02-24**

మా తాత గారు , తన చిన్న తమ్మునికి,   అనగా మా చిన్న తాత గారికి - తన     తాతగారి గురించి  చెప్తూ ఉన్న  ముచ్చట .

" మన అమరావతి రాజుగారికి అంత్యకాలము సమీపించినది . మరిన్ని సూర్యో దయ్యములు చూడ బోను అని అయన

గ్రహించుకున్నాడు. మన అమరావతి కృష్ణకు ఇటు నుండగా - కృష్ణకు ఆవల నున్న ముక్త్యాల లో ఆయన కోట. అయన అందులో వున్నాడు .

మన తాత గారు ఐన సుబ్బన్న దీక్షితులు గారు ఆయనకు ఆస్థాన పురోహితులు . మన దీక్షితులు తాత గారు కాశీ వెళ్లి అప్పుడే వచ్చి నాడు . ముక్త్యాల నుండి రాజావారు రమ్మంటున్నారని ఆయనకు కబురందింది .

"చివరి రోజులు అనుకుంటాను .. పరమేశ్వరుని పాదోదకము తాగవలెనని వున్నది .ఆ కాశీ నుండి ఏమైనా తెచ్చిరా ?" అని రాజా వారు అడిగిరి .

మన దీక్షితులు తాత గారు అందరి వలెనె గంగా జలము తెచ్చిరి కానీ - కాశీ విశ్వేస్వరునికి అభిషేక జలము ఏమీ తేలేదు . తాను వచ్చుచు అట్టి దేదో తెచ్చెదనని రాజా వారు ఆశ పెట్టుకున్నట్లు మన దీక్షితులు తాత గారు గారు గ్రహించి ..వారి ఉప్పు తిని నందుకు గానూ వారి కడపటి కోర్కెను నెరవేర్చవల్సిన భాద్యత తనది అనుకొనిరి .

మన దీక్షితులు తాత గారి కోరిక మేరకు - రాజావారు తన పూజా మందిరంలో ఒక వెండి కాళ్లు కడుగు పళ్ళెరమును ఉంచిరి . మన దీక్షితులు తాత గారు నూతి నుండి ఎనిమిది బిందెల నీరు తెప్పించిరి . ఒక గంగాళము మూతి మీద ఒక నూలు బట్టను ఎనిమిది పొరలుగా పరిపించినాడు . ఈ ఎనిమిది పొరల బట్ట

మీదుగా ఎనిమిది కడవల నీరూ గంగాళము లోనికి వెళ్ళినది . పూజా మందిరములో ఆ గంగాళము ను , ఆ పక్కనే ఆ వెండి పళ్ళెరమును ఉంచి, గదికి తాళము వేయించిన పిదప, మన దీక్షితులు తాత గారు " రాజా వారూ నేటికి తమరు విశ్రమించుడు . పరమేశ్వరుని కృప ఎట్లున్నదో మనము రేపు చూడగలము " అని చెప్పి వెడలి పోయిరి .

మన అమరావతి అమరేశ్వరాలయ నిర్మాత ఈ రాజావారే . ఆ మరు రోజు ఉదయమునే మా తాత గారు రాజావారిని సందర్శించిరి . పూజ గది తలుపులు తెరిపించిరి . వెండి పళ్ళెరములో గిలకల లోతు నీరు నిండి కనిపించినది . మా తాత గారు ఆ పళ్ళెరమును రాజా వారు పరుండి ఉన్న సెయ్య పక్కకు చేర్పించిరి . .

అప్పుడు మన దీక్షితులు తాత గారు ఎక్కడినుండియో ఒక చెంచా తీసి - ఆ చెంచాతో పళ్ళెరము లోని పై పై తేట నీరు తీసి రాజు గారి చేతులో తీర్ధము వాలే పోసిరి . రాజావారు తీర్ధము సేవించి అరచేయి చూసికొనగా చేతిలో బంగారు రంగు ఇసుకరేణువులు అగుపించి నవి . వారు మహదానంద భరితులైరి.

" ఇది ఏమని? " రాజా వారు విభ్రాంతి చెంది- అప్రయత్నముగానే ప్రశ్నించిరి .

దానికి మన దీక్షితులు తాత గారు ఇట్లనిరి " రాజా నా తపో మహిమచే - మీ కోర్కెను పరమేశ్వరునకు ఎఱింగించితిని . ఆయన ఆజ్ఞ మేరకే చేసినది అంతనూ చేసితిని . మిము బ్రోచుటకై మన

అమరావతి అమరేశ్వరుడు, కృష్ణకు అటు ఒడ్డున ఒక కాలు, నది నడిమి ఇసుకలో ఒక కాలు - ఈ ఒడ్డున ఒక కాలు వేసి , ఒక్క అంగలో మీ పూజామందిరం ప్రవేశించిరి . మీరు చేసిన ఏర్పాట్లను బట్టి , కాళ్ళు కడుగుకొని, మీరిచ్చిన ఆసనము స్వీకరించి వెళ్లిరి .మన పరమేశ్వరుడు మహా దాత . వారి ఉనికి కి గుర్తుగా వారు ఈ ఈ ఇసుక రేణువులు ఈ నీటిలో వదిలి వెళ్లిరి . మీ తుది కోర్కె మేరకు మీరు పరమేశ్వరుని పాదోదకము - పాద ధూళి రెండూనూ పొందిరి .అమరావతి శివుడు కదా? ఆయన కటాక్షించిన అట్లే ఉండును " అని చెప్పిరి . రాజావారు ఆ ఇసుకరేణువును శిరమున దాల్చి రి"

------0.0 -----

"ఓయీ తమ్ముడా .. మిగిలిన జలము ఏమైనదని నీవు అడగవచ్చు. .అప్పుడు మన దీక్షితులు తాత గారు అచ్చట ఉన్న వారిని పరికించి " రాజా వారితో పాటు సహమరణము పొందగోరు వారు ఈ తీర్థమును స్వీకరించ వచ్చునని " వాక్కు ఇచ్చిరి . ఎవరునూ ముందుకు రారైతిరి . పళ్లరములోని నీరు క్రమముగా ఇగిరి పోయినది . ఓయి తమ్ముడా చూచితివా ? ఎట్టి వారికైనను ఎట్టి పరిస్థితులలో నైనను వెంట వచ్చు వారెవ్వరునూ వుండరు . అని తెలియుము " అని చెప్పిరి .

మా తాత గారి చిన్న తమ్ముడు అనగా మా చిన్న తాత గారు " ఇది ఇంద్రజాల మహేంద్ర జాల , టక్కు , టమార. గజకర్ణ గోకర్ణ విద్యలలో ఏదై ఉండునో " అనిరి .

"

ఓరీ అవివేకి ఇతి పరమేశ్వర కరుణా కటాక్షవైభవమే  అని ఏల నమ్మవైతివి రా ? నీ వివేకము జ్ఞ్యానము ఏ గంగను కలిసినవిరా ? అని  తన తమ్ముని త్రీవ్రముగా  మందలించిరి .

**--00---**

మా తాత గారు తన  తాతగారైనా  దీక్షితులు గారి గురించి చెప్పుచుండగా నేను అక్కడనే ఉంటిని . వింటిని .

అప్పుడు నేను ఐదు లేదా ఆరేళ్ళ లేప్రాయము వాడను.

అప్పుడు మా పెద్ద తాత గారు నావంక తిరిగి " నీవు ఇటు వంక చూడకుమురా " అనిరి . అయన వద్దన్నాడు కదా ? అని నేను కళ్లు విప్పార్చి అటువంకే చూసితిని .

మా పెద్ద తాత గారు ఎడమచెవిలోకి వేలు దూర్చుకొని గిలకొట్టుకొనిరి . ఆ తదుపరి కుడి చెవిలోనుండి స్పటిక మాల తీసి నాకు ఇచ్చి" భద్రము " అని చెప్పిరి .

నేను అది మా తల్లి గారికి చూపితిని . అప్పుడామె " మీ పెద్ద తాత గారు ఇచ్చిరా ?అయన ఏవేవో కథలు అల్లుచుందురు .అట్లాగే ఏమేమో తీసి ఇచ్చుచుందురు . ఇది మనకు మామూలే " అన్నది .

వారణాసి శ్రీ రామ కృష్ణ స్వీయ రచన .

నానుండి మరిన్నిగా  అమరావతి కధలు కావలెనని కోరుకున్న వారు కలరు .వారికి ఇది నా  ప్రత్యేక సమర్పణ .మా శివుడు కటాక్షించిన కొలదీ రాసెదను.

